సభ్యులకు, ఏజెంట్లకు, శ్రేయోభిలాషులకు



# వినాయకచవితి

## శుభాకాంక్షలు

KAPIL GROUP

# కపిల్ చిట్స్

35 Years of Safeguarding your TRUST

Visit Us: www.kapilchits.com

కపిల్ చిట్స్ మీ కలలకు సాకారం




HYD Vinayaka

# గణపతి ప్రార్థన




శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం !
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే !!

అగజానన పద్మార్కం గజానన మహర్నిశం !
అనేక దంతం భక్తానాం ఏకదంత ముపాస్మహే !!

ఖర్వం స్థూలతనుం గజేంద్రవదనం లంబోదరం సుందరం
ప్రస్యం దన్మధులుబ్ధ మధుపవ్యాలోల గండస్థలమ్
దంతాఘాత విదారితాం రుధిరైః ! సింధూర శోభాకరం
వందేశైలసుతాసుతం గణపతిం సిద్ధిప్రదమ్ కామదమ్ !!

## శ్రీ గణేశ పంచరత్నమాల

(శ్రీ శంకరాచార్య విరచితమ్)

ముదాకరాత్త మోదకం సదా విముక్తి సాధకం
కళాధరావతంసకం విలాస లోక రక్షకం
అనాయ కైకనాయకం వినాశి తేభ దైతకం
నతాశుభాశు నాయకం నమామి తం వినాయకం

నతేతరాతి భీకరం నవోది తార్క భాస్వరం
నమత్సురారి నిర్ఘరం నతాధి కాప దుర్ధరం
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం
మహేశ్వరం త మాశ్రయే పరాత్పరం నిరంతరం

సమస్త లోక శంకరం నిరస్త దైత్య కుంజరం
దరేత రోదరం వరం వరేభ వక్త్ర మక్షరం
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్

అకించ నార్తి మార్జనం చిరంత నోక్తి భాజనం
పూరారి పూర్వ నందనం సురారి గర్వ చర్వణం
ప్రపంచ నాశ భీషణం ధనంజయాది భూషణం
కపోల దానవారిణం భజే పురాణ వారణమ్

నితాంత కాంతదంతకాంతి మంతకాంత కాత్మజం
అచింత్యరూప మంతహీన మంతరాయ కృంతనం
హృదంతరే నిరంతరం వసంతమేవ యోగినాం
త మేకదంత మేకమేవ చింతయామి సంతతమ్

మహాగణేశ పంచరత్న మాదరేణ యోన్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృది స్మరన్ గణేశ్వరం
అరోగతా మదోషతాం సుసాహితీం సుపుత్రతాం
సమాహితాయు రష్టభూతి మభ్యుపైతి సోచిరాత్

## నీకు మ్రొక్కెదన్

తొండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడు పార్వతీతనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన్ !!

తలచెదనే గణనాధుని, తలచెదనే విఘ్నపతిని, దలచిన పనిగా
దలచెదనే హేరంబుని, దలచెద నా విఘ్నములవి తొలగుట కొరకున్ !!

అటుకులు కొబ్బరి పలుకులు చిటిబెల్లము నానబ్రాలు చెరకురసంబున్
నిటలాక్షు నగ్రసుతునకు బటుతరముగ విందుచేసి ప్రార్థింతుమదిన్ !!



# శ్రీ సిద్ధి వినాయక వ్రతకల్పము




**ముం**దుగా బొట్టుపెట్టుకుని, నమస్కరించుకుని, ఈ విధంగా ప్రార్థించుకోవాలి.

**ప్రార్థన:**

శ్లో !! శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥
అయం ముహూర్తస్సుముహూర్తోస్తు ॥

శ్లో !! తదేవలగ్నం, సుదినం తదేవ, తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ, లక్ష్మీపతేతేంఘ్రి యుగంస్మరామి ॥
సుముహూర్తోస్తు ॥

శ్లో !! లాభస్తేషాం, జయస్తేషాం, కుతస్తేషాం పరాభవః
యేషామిందీవర శ్యామో హృదయస్థో జనార్దనః ॥
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమా మ్యహం ॥
సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణికః,
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః,
వక్రతుండ శ్శూర్పకర్ణో, హేరంబః స్కంధ పూర్వజః
అష్టావష్టౌ చ నామాని యః పఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశ నిర్గమేతథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే
అభీప్సితార్థ సిద్ధర్థ్యం, పూజితో యస్సురైరపి,
సర్వవిఘ్నచ్ఛి దేతస్మై గణాధిపతయే నమః ॥

(నమస్కరించుకుని ఆచమనము - ప్రాణాయామము చేసి ఈ విధంగా సంకల్పము చెప్పుకోవాలి)

**సంకల్పం :** ఓం ॥ మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే ముహూర్తే అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే (శ్రీశైలానికి ఏ దిక్కులో వుంటే ఆ దిక్కు పేరు చెప్పుకోవాలి), అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన దుర్ముఖి నామ సంవత్సరే, దక్షిణాయనే, వర్షర్తౌ, భాద్రపదమాసే శుక్లపక్షే చతుర్థ్యాం తిథౌ ఇందు వాసర యుక్తాయాం, శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ, శ్రీమాన్ ....గోత్రః .... నామధేయః, శ్రీమతః ....గోత్రస్య ....నామధేయస్య (పూజ చేసే వారు గోత్రం, పేరు చెప్పుకోవాలి.



పూజకు కూర్చున్న చిన్నారుల పేర్లు కూడా చెప్పాలి) ధర్మపత్నీ సమేతస్య అస్మాకం సహ కుటుంబానాం క్షేమ స్థయిర్య విజయాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం, మనోవాంఛాఫల సిద్ధ్యర్థం, సమస్త దురితోపశాంత్యర్థం, సమస్త మంగళావాప్త్యర్థం, వర్షేవర్షేప్రయుక్త వరసిద్ధి వినాయక చతుర్థీ ముద్దిశ్య, శ్రీ వరసిద్ధి వినాయకదేవతా ప్రీత్యర్థం కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి

## పూజా సన్నాహం

**వి**నాయక చవితి రోజు ఉదయాన్నే ఇంటిని శుభ్రం చేసుకొని మామిడి ఆకుల తోరణం కట్టుకోవాలి. వాకిళ్ళను అలంకరించుకోవాలి. కుటుంబ సభ్యులంతా తలంటుకొని స్నానం చేయాలి. దేవుని గది వుంటే అందులో లేదా పరిశుభ్రమైన ప్రదేశంలో ఒక పీటవేసి, దానిపై మనం తెచ్చుకున్న వినాయకుడి విగ్రహాన్ని ఉంచాలి. తెచ్చిన పూజా సామాగ్రిని కూడా అందుబాటులో ఉంచుకోవాలి. వినాయకుడికి ఉండ్రాళ్ళు చాలా ఇష్టం. మిగిలిన భక్ష్యాలున్నా లేకున్నా వీటిని తప్పనిసరిగా తయారు చేసుకోవాలి. వినాయకుడి విగ్రహం ఎదుట పీటపై కొంచెం బియ్యం పోసి దానిపై రాగి లేదా వెండి లేదా మట్టి పాత్రను వుంచాలి. దానికి పసుపు రాసి బొట్లు పెట్టాలి. దానిలో కొన్ని అక్షతలు, పూలు వేసి దానిపై మామిడి ఆకులు వుంచి ఆపై కొబ్బరికాయతో కలశం ఏర్పాటు చేసుకోవాలి. ఆ తరువాత పసుపు ముద్దతో చిట్టి పసుపు గణపతిని తయారు చేసుకోవాలి. పూజకు ముందు ఒక గ్లాసులో చెంచా లేదా ఉద్ధరిణ ఉంచుకొని పక్కన మరో చిన్న ప్లేటు పెట్టుకోవాలి. పూజ చేస్తున్నప్పుడు చేతికి పసుపు, కుంకుమలు అవుతాయి కాబట్టి చేతికింద ఒక శుభ్రమైన గుడ్డను ఉంచుకుంటే బాగుంటుంది.

### పూజకు కావలసిన సామగ్రి

పసుపు, కుంకుమ, గంధం, అగరువత్తులు, కర్పూరం, తమలపాకులు, వక్కలు, పూలు, పూలదండలు, అరటి పండ్లు, కొబ్బరికాయలు, బెల్లం లేదా పంచదార, పంచామృతాలు, తోరము, దీపారాధన కుందులు, నెయ్యి లేక నూనె, దీపారాధన వత్తులు. వినాయకుడి ప్రతిమ, 21 రకాల ఆకులు, ఉండ్రాళ్ళు, పాయసం, భక్ష్యాలు.

### చిన్నారి దేవుళ్ళ పండుగ

**వి**నాయక పూజా విధానం చిన్నారులను అమితంగా ఆకర్షిస్తుంది. వారికి పూజా విధానం, మన ఆచార సంప్రదాయాలు నేర్పేందుకు ఇది చక్కని అవకాశం. వివిధ రకాల ఆకులతో దేవుడ్ని పూజించడం ద్వారా వారికి ప్రకృతి ప్రాధాన్యతను వివరించే వీలుంది. చిన్నారులకు వీలుంటే రోజూ వేసుకొనే దుస్తులకు భిన్నమైన బట్టలు వేస్తే వారికి వినాయకచవితి పట్ల మరింత ఆసక్తి పెరుగుతుంది. ఒకటి, మూడు, ఐదు లేక తొమ్మిది ముడులతో తోరాన్ని తయారు చేసి, పూజలో వుంచి దానిని పిల్లలు, పెద్దలు అందరూ ధరించవచ్చు.




**ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే** (అంటూ కుడిచేతి మధ్యవేలితో నీళ్ళు ముట్టుకోవాలి) **ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే । తదంగ కలశ పూజాం కరిష్యే ॥**

### కలశపూజ:

**కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య । తస్యోపరి హస్తం నిధాయ ।**

(కలశంలో గంధం, పుష్పాలు, అక్షతలు వుంచి దానిని చేతితో తాకుతూ ఈ మంత్రం చదవాలి)

**కలశస్య ముఖే రుద్రః కంఠే విష్ణుసమాశ్రితః**
**మూలే తత్రస్థితో బ్రహ్మా, మధ్యే మాతృగణాస్మృతాః,**
**కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా**
**ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః**
**అంగైశ్చసహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥**
**ఆయాంతు దేవపూజార్థం దురితక్షయకారకాః**

(మన వద్ద వున్న నీటిపాత్ర చుట్టూ గంధం రాసి బొట్లు పెట్టి అందులో తమలపాకు వుంచుకోవాలి. ఈ శ్లోకం చదువుతూ ఆకును నీటిలో సవ్య పద్ధతిలో తిప్పాలి)

**శ్లో ॥ గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ**
**నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు ॥**

తమలపాకుతో కలశంలోని నీటిని పూజాద్రవ్యముల మీదా, దైవము మీదా, తమమీదా కొద్దిగా చిలకరించుకోవాలి. అనంతరం పసుపు గణపతిని పూజించాలి.

### విఘ్నేశ్వర పూజ

**గణానాంత్వాం గణపతిగ్ం హవామహే, కవిం కవీనా ముపమశ్రవస్తమం**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణ్యస్పత్యః ఆనశృణ్వన్నూతిభిస్సీద సాదనం ॥**
**శ్రీ మహాగణాధిపతయే నమః ॥**

ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే (మధ్య వేలితో నీటిని తాకాలి)

### ధ్యానం :

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం**
**ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥**

అనే శ్లోకం చదువుతూ పూవులూ అక్షతలూ కలిపి పసుపు గణపతి పాదాల చెంత ఉంచాలి. పూజను దేవుని పాదాల వద్ద మాత్రమే చేయాలి. శిరసుపైన పూలు కానీ అక్షతలు కానీ చల్లరాదు.

**ధ్యాయామి ధ్యానం సమర్పయామి ॥ ఆవాహయామి ఆవాహనం సమర్పయామి ॥ హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ॥ పాదయోః పాద్యం సమర్పయామి ॥** అని చెబుతూ ఉద్ధరిణతో నీటిని పసుపు గణపతికి చూపించి ఆ నీటిని చిన్న పళ్ళెం లేదా పాత్రలో వేయాలి.

పసుపు గణపతిని గంధం, అక్షతలు, పసుపు, కుంకుమ, పూలతో పూజించాలి. అగరువత్తులు వెలిగించి, బెల్లం లేదా పండు నైవేద్యం పెట్టి షోడశోపచార పూజ చేయాలి.)

**యధాభాగం గుడం నివేదయామి ॥ శ్రీ మహాగణాధిపతి సుప్రసన్నో, సుప్రీతో, వరదోభవతు ॥ శ్రీ గణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి ॥** అంటూ పూజ చేసిన అక్షతలు రెండు తీసుకొని తలపై ఉంచుకోవాలి.

మరలా ఆచమనం చేసి పైన సూచించిన విధంగా సంకల్పం చెప్పుకోవాలి.

**అథ శ్రీ వరసిద్ధి వినాయక పూజాం కరిష్యే. తదంగ ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే-** అంటూ కుడిచేతి మధ్య వేలితో నీటిని తాకాలి.

### శ్రీ వరసిద్ధి వినాయక ప్రాణప్రతిష్ఠ :-

(విగ్రహంపై పువ్వుతో కొంచెం పంచామృతాలను చిలకరించి)

**ఓం ఆంహ్రీంక్రోం యంరంలంవం శంషంసంహం - ఇత్యాద్యేన ప్రాణప్రతిష్ఠాపనం కృత్వా, నమస్కృత్వా** (నమస్కారం చేస్తూ)
**ఓం శ్రీ వరసిద్ధి వినాయకాయ నమః**

**శ్లో!! స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం**
**తావత్వం ప్రీతిభావేన బింబేస్మిన్ సన్నిధిం కురు ॥**

అవాహితోభవ, స్థాపితోభవ, సుప్రసన్నోభవ, అవకుంఠితోభవ,



వరదోభవ, ప్రసీద, ప్రసీద, ప్రసీద (అంటూ వినాయకుడి విగ్రహం పాదాల వద్ద అక్షతలు లేక పూలు వేయాలి)

### షోడశోపచార పూజా :-

**భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణమ్**
**విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజమహం భజే ॥**
**ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం**
**పాశాంకుశధరం దేవం ధ్యాయే త్సిద్ధి వినాయకమ్ ॥**
**ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం**
**భక్తాభీష్టప్రదం తస్మాత్ ధ్యాయేత్తం విఘ్ననాయకం ॥**
**ధ్యాయే ధ్గజాననం దేవం తప్తకాంచన సన్నిభం**
**చతుర్భుజం మహాకాయం సర్వాభరణ భూషితం ॥**
**శ్రీ గణాధిపతయే నమః ధ్యాయామి ॥** (వినాయకుడి విగ్రహం పాదాల వద్ద పూలు, అక్షతలు వేసి నమస్కరించాలి)

**అత్రాగచ్ఛ జగద్వన్ద్య సురరాజార్చితేశ్వర**
**అనాథనాథ సర్వజ్ఞ గౌరీగర్భసముద్భవ ॥**
**ఆవాహయామి ॥** (మరల అక్షతలు వేయాలి)

**మౌక్తికైః పుష్యరాగైశ్చ నానారత్నైర్విరాజితమ్**
**రత్నసింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్**
**ఆసనం సమర్పయామి ॥** (అక్షతలు లేదా పూలు వేయాలి)

**గౌరీపుత్ర నమస్తేస్తు శంకరప్రియనందన**
**గృహాణార్ఘ్యం మయాదత్తం గన్ధపుష్పాక్షతైర్యుతమ్**
**అర్ఘ్యం సమర్పయామి ॥** (ఉద్ధరిణతో నీరును స్వామికి చూపించి పక్కన వుంచుకున్న పాత్రలో వేయాలి)

**గజవక్త్ర నమస్తేస్తు సర్వాభీష్టప్రదాయక**
**భక్త్యాపాద్యం మయాదత్తం గృహాణ ద్విరదానన**
**పాద్యం సమర్పయామి ॥** (మరలా కొంచె నీటిని స్వామికి చూపించి స్వామి పాదాల ముందుంచాలి)

**అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణ గణపూజిత**
**గృహాణాచమనందేవ తుభ్యందత్తం మయా ప్రభో**
**ఆచమనీయం సమర్పయామి ॥** (కొంచె నీటిని స్వామికి చూపించి పాత్రలో వేయాలి)

**దధిక్షీరసమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితమ్**
**మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోస్తుతే**

మధుపర్కం సమర్పయామి ॥ (స్వామికి మధుపర్కాన్ని సమర్పించాలి.

**స్నానం :**

**పంచామృతైర్దేవ గృహాణ గణనాయక**
**అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణగణపూజిత**
**పంచామృత స్నానం సమర్పయామి ॥** (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, పంచదార, తేనెలు స్వామి విగ్రహంపై చల్లాలి. కొబ్బరికాయ కొట్టి ఆ నీటిని స్వామిపై చల్లాలి)




**గంగాది సర్వ తీర్థేభ్యః ఆహృతై రమలైర్జలైః**
**స్నానం కురుష్వ భగవన్నుమాపుత్ర నమోస్తుతే**
**శుద్ధోదక స్నానం సమర్పయామి ॥** (కొంచెం నీటిని స్వామిపై చల్లాలి)

**రక్తవస్త్రద్వయంచారు దేవయోగ్యంచ మంగళం**
**శుభప్రద గృహాణత్వం లమ్బోదర హరాత్మజ**
**వస్త్రయుగ్మం సమర్పయామి ॥** (స్వామికి వస్త్రాలు లేదా ఇంట్లో పూజ చేసుకొనేట్లయితే పత్తికి పసుపు, కుంకుమ రాసి దానిని వస్త్రంగా ఇవ్వవచ్చు)

**రాజితం బ్రహ్మసూత్రంచ కాంచనం చోత్తరీయకమ్**
**గృహాణదేవ సర్వజ్ఞ భక్తానామిష్టదాయక**
**ఉపవీతం సమర్పయామి ॥** (యజ్ఞోపవీతాన్ని సమర్పించాలి)

**చందనాగరు కర్పూర కస్తూరీ కుంకుమాన్వితం**
**విలేపనం సురశ్రేష్ట ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్**
**గంధం సమర్పయామి ॥** (కొంచెం గంధాన్ని స్వామికి అలంకరించాలి)

**అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్**
**శుభాన్ గృహాణ పరమానంద శంభుపుత్ర నమోస్తుతే**
**అక్షతాన్ సమర్పయామి ॥** (స్వామికి అక్షతలు సమర్పించాలి)

**సుగన్ధాని చ పుష్పాణి జాతీకుంద ముఖాని చ**
**యేకవింశతి పత్రాణి, సంగృహాణ నమోస్తుతే**
**పుష్పాణి పూజయామి ॥**
(స్వామిని పూలతో పూజించాలి)

## శ్రీ వినాయక అష్టోత్తర శతనామావళిః

(ఈ క్రింది నామాలు చదువుతూ స్వామిని పూలతోగాని, అక్షతలతో గాని పూజించాలి. ఒకరు నామాలు చదువుతుండగా మిగిలిన వారు ఓం అనుకుంటూ పూజ చేయాలి.)

ఓం గజాననాయ నమః
ఓం గణాధ్యక్షాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం వినాయకాయ నమః
ఓం ద్త్వెమాతురాయ నమః
ఓం ద్విముఖాయ నమః
ఓం ప్రముఖాయ నమః
ఓం సుముఖాయ నమః
ఓం కృతినే నమః
ఓం సుప్రదీపాయ నమః
ఓం సుఖనిధయే నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం సురారిఘ్నాయ నమః
ఓం మహాగణపతయే నమః
ఓం మాన్యాయ నమః
ఓం మహాకాలాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం హేరంబాయ నమః,
ఓం లంబజఠరాయ నమః,
ఓం హ్రస్వగ్రీవాయ నమః,
ఓం మహోదరాయ నమః,
ఓం మదోత్కటాయ నమః,
ఓం మహావీరాయ నమః,
ఓం మంత్రిణే నమః,
ఓం మంగళస్వరాయ నమః,
ఓం ప్రమధాయ నమః,
ఓం ప్రథమాయ నమః,
ఓం ప్రాజ్ఞాయ నమః,
ఓం విఘ్నకర్త్రే నమః,
ఓం విఘ్నహంత్రే నమః,
ఓం విశ్వనేత్రే నమః,
ఓం విరాట్పతయే నమః,
ఓం శ్రీపతయే నమః,
ఓం వాక్పతయే నమః,
ఓం శృంగారిణే నమః,
ఓం ఆశ్రితవత్సలాయ నమః,
ఓం శివప్రియాయ నమః,
ఓం శీఘ్రకారిణే నమః,
ఓం శాశ్వతాయ నమః,
ఓం బలాయ నమః,
ఓం బలోత్థితాయ నమః,
ఓం భవాత్మజాయ నమః,
ఓం పురాణపురుషాయ నమః,
ఓం పూష్ణే నమః,
ఓం పుష్కరోత్షిప్తవారిణే నమః,
ఓం అగ్రగణ్యాయ నమః,
ఓం అగ్రపూజ్యాయ నమః,
ఓం అగ్రగామినే నమః,
ఓం మంత్రకృతే నమః,
ఓం చామీకరప్రభాయ నమః,
ఓం సర్వస్మై నమః,
ఓం సర్వోపాస్యాయ నమః,
ఓం సర్వకర్త్రే నమః,
ఓం సర్వనేత్రే నమః,
ఓం సర్వసిద్ధిప్రదాయ నమః,
ఓం సర్వసిద్ధియే నమః,
ఓం పంచహస్తాయ నమః,
ఓం పార్వతీనందనాయ నమః,
ఓం ప్రభవే నమః,
ఓం కుమారగురవే నమః,
ఓం అక్షోభ్యాయ నమః,
ఓం కుంజరాసుర భంజనాయ నమః,
ఓం ప్రమోదాయ నమః,
ఓం మోదకప్రియాయ నమః,
ఓం కాంతిమతే నమః,
ఓం ధృతిమతే నమః,
ఓం కామినే నమః,
ఓం కపిత్థవనప్రియాయ నమః,
ఓం బ్రహ్మచారిణే నమః,
ఓం బ్రహ్మరూపిణే నమః,
ఓం బ్రహ్మవిద్యాదిదానభువే నమః,
ఓం జిష్ణవే నమః,
ఓం విష్ణుప్రియాయ నమః,
ఓం భక్తజీవితాయ నమః,
ఓం జితమన్మథాయ నమః,
ఓం ఐశ్వర్యకారణాయ నమః,
ఓం జ్యాయసే నమః,
ఓం యక్షకిన్నర సేవితాయ నమః,
ఓం గంగాసుతాయ నమః,
ఓం గణాధీశాయ నమః,
ఓం గంభీరనినదాయ నమః,
ఓం వటవే నమః,
ఓం అభీష్టవరదాయ నమః,
ఓం జ్యోతిషే నమః,
ఓం భక్తనిథయే నమః,
ఓం భావగమ్యాయ నమః,
ఓం మంగళప్రదాయ నమః,
ఓం అవ్యక్తాయ నమః,
ఓం అప్రాకృత పరాక్రమాయ నమః,
ఓం సత్యధర్మిణే నమః,
ఓం సఖయే నమః,
ఓం సరసాంబునిథయే నమః,
ఓం మహేశాయ నమః,
ఓం దివ్యాంగాయ నమః,
ఓం మణికింకిణీ మేఖలాయ నమః,
ఓం సమస్త దేవతామూర్తయే నమః,
ఓం సహిష్ణవే నమః,
ఓం సతతోత్థితాయ నమః,
ఓం విఘాతకారిణే నమః,
ఓం విశ్వగ్దృశే నమః,
ఓం విశ్వరక్షాకృతే నమః,
ఓం కళ్యాణగురవే నమః,
ఓం ఉన్మత్తవేషాయ నమః,
ఓం పరాజితే నమః,
ఓం సమస్త జగదాధారాయ నమః,
ఓం సర్వైశ్వర్యప్రదాయ నమః,
ఓం ఆక్రాంత చిదచిత్ప్రభవే నమః,
ఓం విఘ్నేశ్వరాయ నమః,
ఓం శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః అష్టోత్తర శతనామార్చనం సమర్పయామి.




**అథ అంగపూజ**

గణేశాయ నమః పాదౌపూజయామి ॥
ఏకదంతాయ నమః గుల్ఫౌపూజయామి ॥
శూర్పకర్ణాయ నమః జానునీ పూజ యామి॥
విఘ్నరాజాయ నమః జంఘౌ పూజయామి ॥
ఆఖు వాహనాయ నమః ఊరూం పూజయామి ॥
హేరంబాయ నమః కటిం పూజయామి ॥
లంబోదరాయ నమః ఉదరం పూజయామి ॥
గణనాథాయనమః నాభిం పూజయామి ॥
గణేశాయ నమః హృదయం పూజయామి ॥
స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి ॥
స్కందాగ్రజాయనమః స్కందౌ పూజయామి ॥
పాశహస్తాయ నమః హస్తౌపూజయామి ॥
గజవక్త్రాయ నమః వక్త్రంపూజయామి ॥
విఘ్నహంత్రే నమః నేత్రే పూజయామి ॥
శూర్పకర్ణాయ నమః కర్ణౌ పూజయామి ॥
ఫాలచంద్రాయ నమః లలాటం పూజయామి ॥
సర్వేశ్వరాయ నమః శిరఃపూజ యామి॥
విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి ॥

**అథ ఏకవింశతి పత్ర పూజ**

(ఒక్కొక్క నామం చదువుతూ బ్రాకెట్‌లో పేర్కొన్న పత్రాలు తీసుకుని స్వామిని పూజించాలి)



ఓం సుముఖాయ నమః మాచీపత్రం పూజయామి (మాచిపత్రి)
ఓం గణాధిపాయ నమః బృహతీపత్రం పూజయామి (వాకుడాకు)
ఓం ఉమాపుత్రాయ నమః బిల్వపత్రం పూజయామి (మారేడు)
ఓం గజాననాయ నమః దూర్వాయుగ్మం పూజయామి (గరికె)
ఓం హరసూనవే నమః దత్తూరపత్రం పూజయామి (ఉమ్మెత్త)
ఓం లంబోదరాయ నమః బదరీపత్రం పూజయామి (రేగి)
ఓం గుహాగ్రజాయ నమః అపామార్గపత్రం పూజయామి (ఉత్తరేణు)
ఓం గజకర్ణాయ నమః తులసీపత్రం పూజయామి (తులసి)
ఓం ఏకదంతాయ నమః చూతపత్రం పూజయామి (మామిడి)
ఓం వికటాయ నమః కరవీరపత్రం పూజయామి (గన్నేరు)
ఓం భిన్నదంతాయ నమః విష్ణుక్రాంతపత్రం పూజయామి (విష్ణుక్రాంతం)
ఓం వటవే నమః దాడిమీపత్రం పూజయామి (దానిమ్మ)
ఓం సర్వేశ్వరాయ నమః దేవదారుపత్రం పూజయామి (దేవదారు)
ఓం ఫాలచంద్రాయ నమః మరువకపత్రం పూజయామి (మరువం)
ఓం హేరంబాయ నమః సింధువారపత్రం పూజయామి (వావిలి)
ఓం శూర్పకర్ణాయ నమః జాజీపత్రం పూజయామి (జాజి)
ఓం సురాగ్రజాయ నమః గండకీపత్రం పూజయామి(గండకీ)
ఓం ఇభవక్త్రాయ నమః శమీపత్రం పూజయామి (జమ్మి)
ఓం వినాయకాయ నమః అశ్వత్థపత్రం పూజయామి(రావి)
ఓం సురసేవితాయ నమః అర్జునపత్రం పూజయామి (మద్ది)
ఓం కపిలాయ నమః అర్కపత్రం పూజయామి (తెల్లజిల్లేడు)
ఓం శ్రీ గణేశ్వరాయ నమః ఏకవింశతపత్రాణి పూజయామి.

(పైన ఇచ్చిన అష్టోత్తరశతనామాలు చదువుతూ స్వామికి పూలతో లేదా అక్షతలతో పూజ చేయాలి.)

**ధూపం**

**శ్లో ॥ దశాంగం గుగ్గు లోపేతం సుగన్ధిం సుమనోహరమ్**
**ఉమాసుత నమస్తుభ్యం గృహాణవరదోభవ ధూపమాఘ్రపయామి ॥**
(అగరువత్తి వెలిగించి ఆ ధూపాన్ని స్వామికి చూపించి పక్కన వున్న స్టాండులో కాని, అరటి పండుకు కానీ గుచ్చాలి.)

**దీపం**

**సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా ద్యోతితం మయా**
**గృహాణ మంగళం దీపం ఈశపుత్ర నమోస్తుతే**
**దీపం దర్శయామి ॥**
(దీపాన్ని స్వామికి చూపించాలి)

**నైవేద్యం**

(కొబ్బరి కాయలు ఇంకా వుంటే వాటిని తలా ఒకటి కొట్టి నైవేద్యం పెట్టాలి. అంతకు ముందు స్నానం సమయంలో కొట్టిన కొబ్బరికాయను, పిండి వంటలు, పానకం, వడపప్పు, కుడుములు, ఉండ్రాళ్ళు, అరటిపండ్లు మొదలైన వాటిని స్వామి ముందుంచాలి)

**సుగంధాన్ సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్,**
**నైవేద్యం గృహ్యతాం దేవ చణముద్గ్యైః ప్రకల్పితాన్ ॥**
**భక్ష్యం, భోజ్యంచ లేహ్యం చ చోష్యం పానీయ మేవచ ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక- మహానైవేద్యం సమర్పయామి ॥**
అంటూ ఆకుతో ఆ పదార్థాలన్నింటిపైన కొద్దిగా నీరు చల్లాలి. ఆ తరువాత స్వామికి నైవేద్యం పెట్టాలి.

**తాంబూలం**

**పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతమ్,**
**కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్**



మీకు తెలుసా
ఎన్నో రకాల వ్యాధులు మరియు ఆరోగ్య సమస్యలు త్రాగునీటి వలననే కలుగుతాయి.
అవును. త్రాగునీరు వివిధ రకాల ఆరోగ్య పరమైన సమస్యలను మనకు కలిగిస్తాయి. అందువలన మనం తప్పని సరిగా సురక్షిత నీటినే త్రాగవలెను. తద్వారా నీటి సంబంధిత బ్యాక్టీరియల్ మరియు వైరల్ ఇన్‌ఫెక్షన్స్ మన ఆరోగ్యంపై ప్రభావం చూపవు.
మీ త్రాగునీటిలోని వ్యాధికారక బాక్టీరియాను తొలగించేందుకు నిరూపిత పురాతన పరిష్కారం:
తులసి (ఆసిమం సాంక్టం మరియు ఇతర జాతులు) శతాబ్దాలుగా ఆయుర్వేదంలో ప్రభావంతమైన చికిత్సలో ఉపయోగించబడుతోంది. యాంటీ వైరల్, యాంటీ ఫంగల్, యాంటీ ఆక్సిడంట్ మరియు యాంటీ స్ట్రెస్ వగైరా వంటి వాటికి ప్రభావంతమైన చికిత్సలకు ఇది విస్తృత పరిధిని కలిగియుంది. తులసి దీని యొక్క యాంటీ మైక్రోబియల్ లక్షణాల కారణంగా నీటి సంబంధిత ఆరోగ్య సమస్యలపై నివారణకు చక్కగా పనిచేస్తుంది.
మీ రోజూవారీ త్రాగునీటిలో 5 రకాల తులసుల నుండి తయారు చేయబడిన డెల్టాస్ పంచ తులసి చుక్కలను కలుపుట వలన త్రాగునీటిలోని వ్యాధి కారక బాక్టీరియాను తొలగించటమే కాక రోగ నిరోధక శక్తిని పెంపొందించుటలో తోడ్పడుతుంది.
డెల్టాస్
పంచ తులసి®
డ్రాప్స్
ఆరోగ్యకరమైన కుటుంబానికి ఎలిక్సిర్
Deltas
PANCHA TULASI
Drops
ఆరోగ్య కరమైన జీవనానికి
సురక్షితమైన నీరు!
త్రాగే నీటిలోని వ్యాధికారక బాక్టీరియాను తొలగిస్తుంది
రోగనిరోధక శక్తిని పెంపొందిస్తుంది
జీర్ణ వ్యవస్థను మెరుగుపరుస్తుంది
వాడే విధానం: రోజూ త్రాగే నీటిలో లీటరుకి 5 చుక్కల చొప్పున పంచతులసిని కలిపి క్రమం తప్పకుండా ఎల్లపుడూ ఆ నీటినే త్రాగవలెను. ఉత్తమ ఫలితాల కొరకు ప్యాక్‌లోని సూచనల మాన్యువల్‌ను అనుసరించండి.*
CLINICALLY TESTED
లభించు ప్రదేశాలు:
amazon.in Paytm
Flipkart MedPlus Apollo
అన్ని ఆయుర్వేద మరియు మెడికల్ షాపులలో లభిస్తుంది.
* గర్భిణులు మరియు 3 సంవత్సరాలలోపు వయసు గల పిల్లలు వాడరాదు.
DELTAS PHARMA
info@deltaspharma.com
www.deltaspharma.com
టోల్ ఫ్రీ నం: 1800 3002 3312
వ్యాపార వివరాలకు: 097028 22 222




వినాయకచవితి శుభాకాంక్షలు
Golden Empire
AP CRDA LP No. 78/2015/VJA
గూడవల్లి జంక్షన్, విజయవాడ
రామవరప్పాడు రింగ్‌కు 8కి.మీ
• రెసిడెన్షియల్ లే అవుట్స్
• స్పాట్ రిజిస్ట్రేషన్
• క్లియర్ టైటిల్
బ్యాంక్‌లోన్ సౌకర్యం
సులభ వాయిదాల పద్ధతి కలదు
GOLDEN HOMES
AP CRDA LP No. 135/2015/VJA
ఈడ్పుగల్లు - విజయవాడ
బెంజిసర్కిల్‌కు 11కి.మీ
GOLDEN GATEWAY
TO CAPITAL CITY OF AMARAVATHI
Golden Heaven
Phase - I & II
AP CRDA LP No. 108/2015/VJA
AP CRDA LP No. 5/2016/VJA
కంచికచర్ల - బత్తినపాడు
చెవిటికల్లు - అమరావతి
నవ్యాంధ్ర రాజధాని అమరావతి 5కి.మీ
NH-9 విజయవాడ - హైదరాబాద్ హైవే ఫేసింగ్‌తో
నందిగామ దగ్గర నవాబ్‌పేటలో ప్రతిష్ఠాత్మక వెంచర్
DTCP T.L.P No. 76/2015/R
ఆనంద నిలయం
చైతన్య కిరణ్ హౌసింగ్ ప్రై. లిమిటెడ్
VIJAYAWADA
# 59A-10-1,4th Floor, Matha Towers
Stella College Road, Near Benz Circle
Viajayawada. Ph : 0866-2492499
VISAKHAPATNAM
# 50-81-36/1, 4th Floor, Sree Balaji Chambers
Seethammapeta Main Road, Gurudwar Junction
Visakhapatnam. Ph : 0891-2789699
HYDERABAD
# 8-4-510/1, 1st Floor, BL Plaza
Opp. Indian Oil Petrol Bunk, Erragadda Main Road
Hyderabad. Ph : 040-23816009
Cell : 99852 33456. www.chaitanyakiranhousing.com




తాంబూలం సమర్పయామి.

(తమలపాకులు, వక్క, పండు, దక్షిణతో కూడిన తాంబూలాన్ని వినాయకుడి విగ్రహం ముందు వుంచి నమస్కరించాలి.)

## నీరాజనం

**సదానందద విఘ్నేశ పుష్కలాని ధనాని చ,**
**భూమ్యాం స్థితాని భగవన్ స్వీకురుష్వ వినాయక**
**సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి ॥**
**ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూరశకలైస్తథా**
**నీరాజనం మయాదత్తం గృహాణవరదోభవ**
**నీరాజనం సమర్పయామి ॥**

(కర్పూరం వెలిగించి స్వామికి హారతి ఇచ్చి, ఆ తరువాత హారతి పాత్రపై కొంచె నీటిని ఉంచి కళ్ళకు అద్దుకోవాలి)

## మంత్రపుష్పం

(పుష్పం, అక్షతలు తీసుకొని నిలుచొని ఈ శ్లోకాన్ని పఠించాలి)

**సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణికః**
**లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపా**
**ధూమకేతుః గణాధ్యక్షో ఫాలచంద్రో గజాననః**
**వక్రతుండః మహాకాయ కోటిశూర్య సమప్రభ**
**అవిఘ్నం కురుమే దేవా సర్వకార్యేషు సర్వదా**

(అక్షతలు, పూలు స్వామి పాదాల వద్ద వుంచాలి)

## ప్రదక్షిణ

**శ్లో ॥ యానికానిచ పాపాని జన్మాన్తరకృతానిచ ।**
**తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదేపదే ॥**
**పాపో హం పాపకర్మాహం పాపాత్మా పాపసమ్భవః ।**
**త్రాహిమాం కృపయా దేవ శరణాగత వత్సల ॥**
**అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।**
**తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష గణాధిప ॥**
**ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ॥**

(ప్రదక్షిణ చేసి నమస్కరించాలి. సాష్టాంగ ప్రణామం చేయడం సంప్రదాయం)

ఆ తరువాత మరలా కూర్చొని, కొన్ని అక్షతలు చేతిలోకి తీసుకోవాలి. కొంచె నీటిని అక్షతలపై వేసుకొని ఈ శ్లోకం చెప్పుకోవాలి.

**యస్యస్మృత్యాచ నామోఖ్య తపః పూజా క్రియాదిషు**
**న్యూనం సంపూర్ణం తాం యాతి సద్యో వందే తం గణాధిపం**
**మంత్రహీనం క్రియాహీనం శక్తిహీనం మహప్రభో**
**యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే**
**అనయా ధ్యానమావాహనాది షోడషోపచార పూజయాచ, అష్టోత్తర నామార్చనయాచ, అవసర, మహా నివేదన యాచ భగవాన్ సర్వాత్మకః సర్వం శ్రీ మహాగణాధిపతి దేవతార్పణమస్తు. శ్రీ మహాగణాధిపతి దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు** అంటూ అక్షతలు, నీటిని పళ్ళెంలో వదలాలి. ఆ నీటిని, పంచామృతాలు, కొబ్బరి నీళ్ళను కలిపి తీర్థంగా తీసుకోవాలి.

పూజ చేసిన అక్షతలను పిల్లల శిరస్సుపై వుంచాలి. పెద్దలు కూడా ఆ అక్షతలు శిరసుపై ధరించాలి. ■

## విఘ్నేశ్వరుని మంగళహారతులు



శ్రీశంభుతనయునకు సిద్ధిగణనాథునకు వాసిగల దేవతావంద్యునకును
ఆ సరస విద్యలకు ఆది గురువైనట్టి భూసురోత్తమ లోకపూజ్యునకును
॥ జయ మంగళం నిత్య శుభమంగళం ॥
నేరేడు మారేడు నెలవంక మామిడి దుర్వార చెంగల్వ ఉత్తరేణు
వేరువేరుగదెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవగణపతికినిపుడు ॥ జయ ॥
సుచిరముగ భాద్రపద శుద్ధ చవితియందు పొసగ సజ్జనులచే పూజగొల్తు
శశి చూడరాదన్న జేకొంటి నొక వ్రతము పర్వమున దేవగణపతికినిపుడు ॥ జయ ॥
పానకము వడపప్పు పనస మామిడిపండ్లు దానిమ్మ ఖర్జూర ద్రాక్షపండ్లు
తేనెతో మాగిన తియ్య మామిడి పండ్లు మాకు బుద్ధినిచ్చు గణపతికినిపుడు ॥ జయ ॥
ఓ బొజ్జ గణపయ్య నీ బంటునేనయ్య ఉండ్రాళ్ళ మీదికి దండుపంపు
కమ్మనినెయ్యియ్య కడుముద్దపపను బొజ్జవిరుగగ దినుచును పొరలుచున్ ॥ జయ ॥
వెండి పళ్ళెములోన వేయినేల ముత్యాలు కొండలుగ నీలములు కలయబోసి
మెండుగను హారములు మెడనిండ వేసికొని దండిగా నీకిత్తు ధవళారతి ॥ జయ ॥
పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుగొల్తు గంధాల నినుగొల్తు కస్తూరినీ
ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తమ్మున పర్వమున దేవగణపతికినిపుడు ॥ జయ ॥
ఏకదంతంబును ఎల్లగజవదనంబు బాగయిన తొండంబు వలపు కడుపు
జోకయిన మూషికము పరక నెక్కాడుచు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥ జయ ॥
మంగళము మంగళము మార్తాండ తేజునకు మంగళము సర్వజ్ఞ వందితునకు
మంగళము ముల్లోక మహిత సంచారునకు మంగళము దేవగణపతికినిపుడు ॥ జయ ॥
సిద్ధివిఘ్నేశ్వర ప్రసిద్ధిగా పూజింతు ఒనరంగ నిరువదియొక్క పత్రి
దానిమ్మ మరువమ్ము దర్భ విష్ణుక్రాంత యుమ్మెత్త దూర్వార యుత్తరేణి ॥ జయ ॥
కలువలు మారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచన రేగు దేవదారు
జాజి బలురక్కసి జమ్మిదాసానపువ్వు గరికె మాచిపత్రి మంచి మొలక ॥ జయ ॥
అగరు గంధాక్షత ధూప దీప నైవేద్య తాంబూల పుష్పోపహారములను
భాద్రపద శుద్ధ చవితిని కుడుములు నానుబ్రాలు ఉండ్రాళ్ళు పప్పు ॥ జయ ॥
పాయసము జున్ను తేనెయు భక్తిమీర
కోరిపూజింతు నిన్నెపుడు కోర్కెలలర ॥ జయ ॥
బంగారు చెంబుతో గంగోదకముదెచ్చి సంగతిగ శిశువునకు జలకమార్చి
మల్లెపువ్వులు దెచ్చి మురహరిని పూజింతురంగైన నా ప్రాణలింగమునకును ॥ జయ ॥
పట్టుచీరలు మంచి పాడిపంటలు గల్గి ఘనముగా కనకములు కరులు హరులు
ఇష్ట సంపదలిచ్చి యేలిన స్వామికి పట్టభద్రుని దేవ గణపతికినిపుడు ॥ జయ ॥
ముక్కంటి తనయుడని ముదముతో నేనును చక్కనైన వస్తు సమితి గూర్చి
నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కువగు పూజలాలింపజేతు ॥ జయ ॥
మల్లెలా మొల్లలా మంచి సంపెంగలా చల్లనైనా గంధసారములను
ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగ నేజేతు కోరి విఘ్నేశ ॥ జయ ॥
దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యునకు దేవునకును
దేవతలు మిముగొల్చు తెలిసి పూజింతురు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥ జయ ॥
చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను
పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనిపుడు బహుబుద్ధ గణపతికి బాగుగాను ॥ జయ ॥
మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు
నేరేడు నెంవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోడ ॥ జయ ॥
ఓ బొజ్జ గణపతి ఓర్పుతో రక్షించి కాచినన్నేలుమీ కరుణతోను
మాపాల గలవని మహిమీద నెల్లపుడు కొనియాడుచుందును కోర్కెదీర
॥ జయ మంగళం నిత్య శుభమంగళం ॥




# శ్రీ వినాయక వ్రతకథ

**(వ్రతకథ చెప్పుకొనే ముందు కొన్ని అక్షతలు చేతిలో ఉంచుకోవాలి. కథ పూర్తయిన తరువాత ఆ అక్షతలను శిరసుపై వేసుకోవాలి)**

**పూ**ర్వం చంద్రవంశానికి చెందిన ధర్మరాజు జ్ఞాతుల వలన సిరి సంపదలన్నీ పోగొట్టుకున్నాడు. భార్యతోను, తమ్ములతోనూ వనవాసం చేస్తూ ఒకనాడు నైమిశారణ్యానికి చేరుకున్నాడు. అక్కడ శౌనకాది ఋషులకు అనేక పురాణ రహస్యాలను బోధిస్తున్న సూతమహా మునిని దర్శించి, నమస్కరించి "అయ్యా! మేము రాజ్యాధికారము, సమస్త వస్తు వాహనములను పోగొట్టుకున్నాము. ఈ కష్టాలన్నీ తీరి, పూర్వవైభవము పొందేలా ఏదయినా సులభమైన వ్రతాన్ని చెప్పవల సింది" అని ప్రార్థించాడు. అంత సూతుడు ధర్మరాజుకు వినా యకవ్రతం చేస్తే కష్టాలు తొలగిపోయి, సమస్త సౌఖ్యాలు కలుగుతాయంటూ ఇలా చెప్పసాగాడు.



"ఒకసారి కుమారస్వామి పరమశివుణ్ణి దర్శించి- తండ్రీ! మాన వులు ఏ వ్రతం చేయడం వలన వంశవృద్ధిని పొంది, సమస్త కోరి కలూ తీరి, సకల శుభాలను, విజయాలను, వైభవాలనూ పొందగలు గుతారో అటువంటి వ్రతాన్ని చెప్పవలసింది అని కోరాడు. అందుకు శివుడు- నాయనా! సర్వసంపత్కరము, ఉత్తమము, ఆయుష్కామార్థ సిద్ధిప్రదమూ అయిన వినాయక వ్రతమనేదొకటుంది. దీనిని భాద్ర పద శుద్ధ చవితి నాడు ఆచరించాలి. ఆ రోజు ఉదయమే నిద్రలేచి, స్నానం చేసి, నిత్యకర్మలు నెరవేర్చుకుని తమ శక్తిమేరకు బంగారంతో గాని, వెండితోగాని, లేదా కనీసం మట్టితో గాని విఘ్నేశ్వరుడి బొమ్మను చేసి, తమ ఇంటికి ఉత్తర దిక్కులో బియ్యాన్ని పోసి మండ పాన్ని నిర్మించి, అష్టదళ పద్మాన్ని ఏర్పరచాలి. అందులో గణేశుని ప్రతి మను ప్రతిష్ఠించాలి. అనంతరం శ్వేతగంధాక్షతలు, పుష్పాలు, పత్రా లతో పూజించి, ధూపదీపాలను, వెలగ, నేరేడు, చెరకు మొదలైన ఫల ములను, రకమునకు ఇరవై ఒకటి చొప్పున నివేదించాలి. నృత్య, గీత, వాద్య పురాణ పఠనాదులతో పూజను ముగించి, యథాశక్తి వేదవిదు లైన బ్రాహ్మణులకి దక్షిణ తాంబూలాదులను ఇవ్వాలి. బంధుజనంతో కలిసి భక్ష్యభోజ్యాదులతో భోజనం చేయాలి. మరునాడు ఉదయం స్నానసంధ్యలు పూర్తి చేసుకుని గణపతికి పునః పూజ చేయాలి. విప్రు లను దక్షిణ తాంబూలాలతో తృప్తులను చేయాలి. ఈవిధంగా ఎవరైతే వినాయక వ్రతాన్ని చేస్తారో వాళ్ళకి గణపతి ప్రసాదం వలన సకల కార్యములూ సిద్ధిస్తాయి. అన్ని వ్రతములలోకీ అత్యుత్తమమైన ఈ వ్రతం త్రిలోక ప్రసిద్ధమై దేవ ముని గంధర్వాదులందరిచేతా ఆచ రింపబడింది అని పరమశివుడు కుమారస్వామికి చెప్పాడు.

కనుక ధర్మరాజా నువ్వు కూడా ఈ వ్రతాన్ని ఆచరించినట్లయితే- నీ శత్రువులను జయించి సమస్త సుఖాలను పొందుతావు. గతంలో విదర్భ యువరాణి దమయంతి ఈ వ్రతం చేయడం వలనే తాను ప్రేమించిన నలమహారాజును పెండ్లాడగలిగింది. శ్రీకృష్ణుడంతటి వాడు ఈ వ్రతం చేయడం వల్లనే శ్యమంతకమణితో బాటుగా జాంబ వతీ సత్యభామలనే ఇద్దరు కన్యామణులను కూడా పొందగలిగాడు. ఆ కథ చెబుతాను విను అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వకాలమున గజముఖుడయిన గజాననుడు అనే రాక్షసుడు ఒకడు శివుని గూర్చి తపస్సు చేశాడు. అతని తపస్సునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మన్నాడు. అంత గజాసురుడు పరమేశ్వరుని స్తుతించి, స్వామీ నీవు నాయుదరమందే నివసించాలి అని కోరాడు. దాంతో భక్తసులభుడగు శివుడు అతడి కుక్షియందుండి పోయాడు. జగన్మాత పార్వతి భర్తను వెదుకుతూ ఆయన గజాసురుని కడుపులో ఉన్నాడని తెలుసుకున్నది. ఆయనను దక్కించుకొనే ఉపాయం కోసం విష్ణువును ప్రార్థించినది. అంత శ్రీహరి బ్రహ్మాది దేవతలను పిలిపించి చర్చించాడు. గజాసుర సంహారమునకు గంగిరెద్దు మేళమే తగినదని నిర్ణయించారు. నందీశ్వరుని గంగిరెద్దుగా అలంకరించారు. బ్రహ్మాదిదేవతలందరిచే తలకొక వాయిద్యమును ధరింపజేశాడు. మహావిష్ణువు తానును చిరు గంటలు, సన్నాయిలు ధరించాడు. గజాసురపురానికి వెళ్ళి జగన్మోహనంబుగా గంగిరెద్దులను ఆడించుచుండగా గజాసురుడది విని, వారిని పిలిపించి తన భవనము ఎదుట గంగిరెద్దును ఆడించమని కోరాడు. బ్రహ్మాది దేవతలు రసరమ్యంగా వాద్యాలను వాయిస్తుండగా జగన్నాటక సూత్రధారియగు నాహరి చిత్రవిచిత్ర ముగా గంగిరెద్దు నాడించాడు. గజాసురుడు పరమానందభరితుడై "ఏమి కావాలో కోరుకోండి.... ఇస్తాను" అన్నాడు. అంతట శ్రీహరి గజా సురుని సమీపించి "ఇది శివుని వాహనమగు నంది, శివుని కనుగొను టకు వచ్చింది, శివుడ్ని అప్పగించు" అని కోరాడు. ఆ మాటలకు గజా సురుడు నివ్వెరపోయాడు. వచ్చినవాడు రాక్షసాంతకుడగు శ్రీహరి అని తెలుసుకున్నాడు. తనకు మరణం నిశ్చయమనుకున్నాడు. తన గర్భంలో వున్న పరమేశ్వరుడ్ని ఉద్దేశించి "స్వామీ! నా శిరస్సు త్రిలోక పూజ్యముగ చేసి, నా చర్మము నీవు ధరించు" అని ప్రార్థించాడు. తన గర్భంలో వున్న శివుడ్ని తీసుకోవచ్చునని విష్ణుమూర్తికి అంగీకారము తెలియజేశాడు. అంత శ్రీహరి నందిని ప్రేరేపించగా, నంది తన కొమ్ములతో గజాసురుని చీల్చి సంహరించాడు. మహేశ్వరుడు గజాసుర గర్భము నుండి బయటకు వచ్చాడు. విష్ణుమూర్తిని స్తుతించాడు. 'దుష్టాత్ములకు ఇటువంటి వరమును ఇవ్వరాదు, ఇచ్చినచో పామునకు పాలుపోసినట్లు అవుతుందని సూచించాడు. బ్రహ్మాది దేవతలకు వీడ్కోలు చెప్పి శ్రీహరి వైకుంఠమునకు వెళ్ళగా, శివుడు నందినెక్కి కైలాసమునకు వెళ్ళాడు.

## వినాయకోత్పత్తి

కైలాసంలో పార్వతి భర్త రాకను గురించి విని సంతోషించింది. స్వాగతం చెప్పేందుకు స్నానాలంకార ప్రయత్నములో తనకై ఉంచిన నలుగు పిండితో పరధ్యానముగా ఒక ప్రతిమను చేసినది. అది చూడ ముచ్చటైన బాలుడుగా కనిపించింది. దానికి ప్రాణం పోయా లనిపించి, తన తండ్రి ద్వారా పొందిన మంత్రంతో ఆ ప్రతిమకు






ప్రాణప్రతిష్ఠ చేసింది. ఆ దివ్య సుందరుని వాకిట్లో వుంచి, ఎవరినీ లోనికి రానివ్వరాదని చెప్పి లోపలకు వెళ్ళింది.

శివుడు తిరిగి వచ్చాడు. వాకిట్లో వున్న బాలుడు పరమశివుడ్ని అభ్యంతర మందిరంలోనికి పోనివ్వకుండా అడ్డుకున్నాడు. తన ఇంట్లో తనకే అవరోధమా అని శివుడు కోపంతో రగిలిపోయాడు. రౌద్రంతో ఆ బాలుని శిరచ్ఛేదము చేసి, లోపలికి వెళ్ళాడు. జరిగిన దానిని విని పార్వతి విలపించింది. శివుడు కూడా చింతించాడు. వెంటనే తన



వద్దనున్న గజాసురుని శిరమును ఆ బాలుని మొండెమునకు అతికించి ఆ శిరమునకు శాశ్వతత్వమును, త్రిలోక పూజ్యతను కలిగించాడు. గణేశుడు గజాననుడై, శివపార్వతుల ముద్దులపట్టి యైనాడు. ఆ తరువాత శివపార్వతులకు కుమారస్వామి జన్మించాడు.

## విఘ్నేశాధిపత్యం

ఒకనాడు దేవతలు, మునులు, మానవులు, పరమేశ్వరుని సేవించి విఘ్నములకు ఒక అధిపతిని ఇమ్మని కోరారు. గజాననుడు తాను జ్యేష్ఠుడను గనుక ఆధిపత్యము తనకు ఇమ్మని కోరాడు. గజాననుడు మరుగుజ్జువాడు, అనర్హుడు, అసమ ర్థుడు కాబట్టి ఆధిపత్యము తనకే ఇవ్వాలని కుమారస్వామి తండ్రిని వేడుకున్నాడు. అందుకు శివుడు తన కుమారుల నుద్దేశించి "మీ ఇరువురిలో ఎవరు ముల్లోక ములలోని పవిత్ర నదులన్నిం టిలో స్నానము చేసి ముందుగా నా వద్దకు వస్తారో వారికి ఈ ఆధిపత్యం లభిస్తుంద"ని చెప్పాడు. అంత కుమారస్వామి చురుకుగా, సులువుగా సాగి వెళ్ళాడు. గజాననుడు అచేతను డయ్యాడు. మంద గమనుడైన తాను ముల్లోకాల్లోని నదులన్నిం టిలో వేగంగా స్నానం చేసి రావడం కష్టసాధ్యమని, తరుణో పాయం చెప్పమని తండ్రిని వేడుకున్నాడు. వినాయకుని బుద్ధి సూక్ష్మతకు మురిసిపోయిన శివుడు ఫలదాయకమగు నారాయణ మంత్రమును అనుగ్రహించాడు. నారములు అనగా జలములు. జలములన్నియూ నారాయణుని అధీనములు. అనగా నారాయణ మంత్రం అధీనంలో ఉంటాయి. వినాయకుడు ఆ మంత్రం చదువుతూ తల్లిదండ్రుల చుట్టూ ప్రదక్షిణం చేయడం ప్రారంభించాడు. ఆ మంత్ర ప్రభావమున ప్రతితీర్థ స్నానమందును కుమారస్వామి కన్నా ముందే వినాయకుడు ప్రత్యక్షం కావడం ప్రారంభించాడు. ఇలా మూడు కోట్ల యాభై లక్షల నదులలో వినాయకుడే ముందుగా స్నానమాచరించడం చూసి కుమారస్వామి ఆశ్చర్యపడి కైలాసమునకు వెళ్ళాడు. తండ్రి సమీపమున ఉన్న గజాననుని చూచి నమస్కరించి "తండ్రీ! అన్నగారి మహిమ తెలియక ఆధిపత్యం అడిగాను, క్షమించండి ఈ ఆధిపత్యం అన్నగారికే ఇమ్మ"ని ప్రార్థించాడు.

## చంద్రుని పరిహాసం

అంత పరమేశ్వరుడు భాద్రపద శుద్ధ చవితినాడు గజాననునికి విఘ్నేశాధిపత్యం ఇచ్చాడు. ఆనాడు సర్వదేశస్థులు విఘ్నేశ్వరునికి తమ శక్తికొలది కుడుములు, అపూపములు మున్నగు పిండివంటలు, టెంకాయలు, తేనె, అరటిపండ్లు, పానకం, వడపప్పు మొదలగునవి సమర్పించి, పూజించగా, విఘ్నేశ్వరుడు సంతుష్టుడై కుడుములు మున్నగునవి కొన్ని భక్షించి, కొన్ని వాహనమునకిచ్చి, కొన్ని చేత ధరించి మందగమనమున సూర్యాస్తమయ వేళకు కైలాసమునకు వెళ్ళి తల్లిదండ్రులకు ప్రణామం చేయబోయాడు. ఉదరం భూమికానిన చేతులు భూమికానక ఇబ్బంది పడుచుండగా, శివుని శిరమందున్న చంద్రుడు వినాయకుడి అవస్థ చూసి వికటముగా నవ్వాడు. అంత రాజదృష్టి సోకిన రాలుగూడ నుగ్గవుతాయి అనే సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి, అందున్న కుడుములన్నీ ఆ ప్రదేశంలో పడ్డాయి. అతడు మృతి చెందాడు. అంత పార్వతి శోకించుచూ చంద్రుని చూచి "పాపాత్ముడా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించాడు కాబట్టి నిన్ను చూసిన వారు పాపాత్ములై నీలాపనిందల పొందుదురుగాక" యని శపించింది.

## ఋషిపత్నులకు నీలాపనిందలు

ఆ సమయంలో సప్తమహర్షులు యజ్ఞం చేస్తూ తమ భార్యలతో అగ్ని ప్రదక్షిణం చేస్తున్నారు. అగ్నిదేవుడు ఋషి పత్నులను మోహించి, శాపభయంతో అశక్తుడై క్షీణించడం ప్రారంభించాడు. అగ్ని భార్యయైన స్వాహాదేవి అది గ్రహించి అరుంధతి రూపం దక్క మిగిలిన ఋషిపత్నుల రూపం ధరించి పతికి ప్రియం చేసేందుకు ప్రయత్నించింది. అగ్నిదేవునితోనున్నవారు తమ భార్యలేయని శంకించి, ఋషులు తమ భార్యలను విడనాడారు. పార్వతీ శాపానంతరం ఋషిపత్నులు చంద్రుని చూచుటచే వీరికి ఈ నీలాపనింద కలిగింది.

దేవతలు, మునులు ఋషిపత్నులకు వచ్చిన ఆపదను పరమే శ్వరునికి తెలుపగా, అతడు సర్వజ్ఞుండగుటచే అగ్నిహోత్రుని



భార్యయే ఋషి పత్నుల రూపం ధరించిందని చెప్పి ఋషులను సమాధానపరిచాడు. అంత బ్రహ్మ కైలాసమునకు వచ్చాడు. మహేశ్వరుని సేవించి, మృతుండై పడివున్న విఘ్నేశ్వరుని బ్రతికించాడు. పార్వతీపరమేశ్వరులు సంతోషించారు. అంత దేవాదులు "ఓ పార్వతీ! నీ శాపము వల్ల ముల్లోకాలకు కీడు వాటిల్లింది కాబట్టి శాపాన్ని ఉపసంహరించుకోవాల"ని ప్రార్థించారు. తనయుడు మరల బతకడంతో పార్వతి చాలా సంతోషించింది. కుమారుని చేరదీసి ముద్దాడింది. "ఏ రోజున విఘ్నేశ్వరుని చూచి




"చంద్రుడు నవ్వాడో ఆ రోజున చంద్రుని చూడరాదు" అని శాపాన్ని సడలించింది. అంత బ్రహ్మాదులు భాద్రపద శుద్ధ చవితి నాడు మాత్రము చంద్రుని చూడక జాగరూకులై సుఖంబుగ నుండిరి. ఇలా కొంతకాలము గడచింది.

### శమంతకోపాఖ్యానం

ద్వాపరయుగమున నారదుడు ద్వారకావాసియగు శ్రీకృష్ణుని దర్శించి, స్తుతించాడు. మాటల సందర్భంగా స్వామీ! సాయం కాలమయింది, నేడు వినాయక చవితి కాబట్టి పార్వతీదేవి శాపం కారణంగా చంద్రుని చూడరాదు. ఇక సెలవు అని పూర్వవృత్తాంత మంతయూ శ్రీకృష్ణునికి చెప్పి నారదుడు స్వర్గలోకమునకు వెళ్ళాడు. అంతట కృష్ణుడు ఆనాటి రాత్రి చంద్రుడ్ని ఎవరూ చూడరాదని పట్టణంలో చాటించాడు. క్షీరప్రియుడగు శ్రీకృష్ణుడు నాటి రాత్రి తాను ఆకాశం వంక చూడక గోష్ఠమునకు పోయి పాలుపితుకుతూ పాలలో చంద్రుని ప్రతిబింబమును చూశాడు. "ఆహా! ఇక నాకెట్టి అపనింద రానున్నదో" అని అనుకున్నాడు.

కొన్నాళ్ళకు సత్రాజిత్తు సూర్య వరముచే శమంతకమణిని సంపా దించి ద్వారకా పట్టణమునకు శ్రీకృష్ణ దర్శనార్థమై వెళ్ళాడు. శ్రీకృష్ణుడు మర్యాద చేసి ఆ మణిని మన రాజుకిమ్మని అడిగాడు. "రోజుకు ఎనిమిది బారువుల బంగారమిచ్చు దానిని ఏ ఆప్తునకైన నెవ్వరు ఇవ్వ"రని సత్రాజిత్తు తిరస్కరించాడు. అంత ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఆ శమంతకమణిని కంఠమున ధరించి వేటాడడానికి అడవికి వెళ్ళాడు. ఒక సింహం ఆ మణిని మాంస ఖండమని భ్రమించి అతడిని చంపి ఆ మణిని తీసుకుపోతుండగా ఒక భల్లూకం ఆ సింహాన్ని చంపి మణిని తన కుమార్తె జాంబవతికి ఆటవస్తువుగ ఇచ్చింది. మరునాడు సత్రాజిత్తు తమ్ముని మృతి విని, మణి ఇవ్వలేదని కృష్ణుడు నా సోదరుని చంపి రత్నం అపహరించాడని పట్టణమున చాటించాడు. అది కృష్ణుడు విని చవితినాడు పాలలో చంద్రబింబమును చూచిన దోషఫలమని అనుకున్నాడు. దానిని బాపుకొనుటకై బంధుసమేతుడై అరణ్యానికి పోయి వెదుకగా ఒకచోట ప్రసేనుని కళేబరం, సింహం కాలిజాడలు, పిదప ఎలుగుబంటి అడుగులు కనిపించాయి. ఆ దారిన పోవుచుండగా ఒక పర్వత గుహ ద్వారంబును చూచి పరివారమును అక్కడ విడిచి కృష్ణుడు గుహలోపలికి వెళ్ళాడు. అచట బాలిక ఉయ్యాలపై కట్టిన మణిని శ్రీకృష్ణుడు చూశాడు. దానిని తీసుకొని వెనక్కు వస్తుండగా బాలిక ఏడవడం ప్రారంభించింది.

ఆంధ్రజ్యోతి
శ్రీవినాయక పూజావిధానము

అంత జాంబవంతుడు ఆవేశంగా వచ్చి శ్రీకృష్ణుని పైబడి అరచుచు, గోళ్ళతో గుచ్చుతూ, కోరలతో కొరుకుతూ ఘోరముగ యుద్ధము చేసెను. కృష్ణుడు వానిని బడద్రోసి వృక్షములు, రాళ్ళతోను, తుదకు ముష్టిఘాతములతోను రాత్రింబవళ్ళు తెలియక ఇరవై ఎనిమిది రోజులు యుద్ధము చేసెను. క్రమంగా జాంబవంతుని బలం క్షీణించింది. తననే ఓడిస్తున్న వ్యక్తి రావణ హంతకుడగు శ్రీరాముడే అని తెలుసుకున్నాడు. అంజలి ఘటించి "దేవాధిదేవా! ఆర్తజనపోషా! భక్తజనరక్షా నిన్ను శ్రీరామచంద్రునిగా తెలిసికొంటిని. ఆ కాలమున నాయందలి వాత్సల్యముచే వరం కోరుకొమ్మనగా, నా బుద్ధి మాంద్యమున మీతో ద్వంద్వ యుద్ధం జేయవలెనని కోరుకున్నాను. భవిష్యత్తులో నీ కోరిక నెరవేరుతుందని మీరు సెలవిచ్చితిరి. అది మొదలు మీ నామస్మరణ చేయుచూ అనేక యుగములు గడిపాను, ఇపుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చారు. నాకు ఇక జీవితేచ్ఛ లేదు. నా అపరాధములు క్షమించి కాపాడుము. నీ కన్న వేరు దిక్కులేదు" అంటూ భీతిచే పరిపరి విధముల ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయూ తన హస్తములచే నిమిరి భయం పోగొట్టి ఇలా అన్నాడు. శమంతక మణిని అపహరించినట్లు నాపై ఆరోపణ వచ్చింది. అపనింద



బాపుకొనుటకు ఇటు వచ్చాను. కాబట్టి మణిని ఇవ్వమని కోరాడు. జాంబవంతుడు శ్రీకృష్ణునికి మణి సహితముగ తన కుమార్తెనగు జాంబవతిని కానుకగా ఇచ్చాడు.

అంత తన ఆలస్యమునకు పరితపించు బంధుమిత్ర సైన్యంబులకు ఆనందం కలిగించి కన్యారత్నం తోను, మణితోను శ్రీకృష్ణుడు పురం చేరుకున్నాడు. సత్రాజిత్తును రప్పించి పిన్న పెద్దలను ఒకచోట చేర్చి యావత్ వృత్తాంతమును చెప్పాడు. శమంతకమణి సత్రాజిత్తుకు తిరిగి ఇచ్చేశాడు. దాంతో సత్రాజిత్తు "అయ్యో! లేనిపోని నింద మోపి దోషమునకు పాల్పడితి"నని విచారించి "మణి సహితముగ తన కూతురగు సత్యభామను భార్యగా సమర్పించి, తప్పు క్షమింపు"మని వేడుకున్నాడు. శ్రీకృష్ణుడు సత్యభామను గైకొని మణి వలదని తిరిగి ఇచ్చాడు. శ్రీకృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ సత్యభామలను పరిణయమాడాడు. అంత దేవాదులు, మునులు స్తుతించి "మీరు సమర్థులు గనుక నీలాపనింద బాపుకొంటిరి మాకేమి గతి"యని ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై "భాద్రపద శుద్ధ చతుర్థిని ప్రమాదవశంబున చంద్రదర్శనమయ్యేనేని ఆనాడు గణపతిని యథావిధి పూజించి ఈ శమంతకమణి కథను విని అక్షతలు శిరంబున దాల్చువారు నీలాపనిందలు పొందకుందురుగాక" అని చెప్పాడు. అంత దేవాదులు సంతోషించి, తమ ఇళ్ళకు వెళ్ళి ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చతుర్థి యందు దేవతలు, మహర్షులు, మానవులు తమతమ శక్తి కొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధి పొందుతూ సుఖసంతోషాలతో వున్నారు. ■

# సంకష్ట నాశన గణేశ స్తోత్రమ్

ప్రణమ్యశిరసా దేవం గౌరీపుత్రం వినాయకమ్ ।
భక్తావాసం స్మరేన్నిత్యం ఆయుఃకామార్థసిద్ధయే ॥

ప్రథమం వక్రతుండంచ ఏకదన్తం ద్వితీయకమ్ ।
తృతీయం కృష్ణపింగాక్షం గజవక్త్రం చతుర్థకమ్ ॥

లంబోదరం పంచమంచ షష్ఠంచ వికటమేవచ ।
సప్తమం విఘ్నరాజేంద్రం ధూమ్రవర్ణం తథాష్టకమ్ ॥

నవమం ఫాల చంద్రం చ దశమంతు వినాయకమ్ ।
ఏకాదశం గణపతిం ద్వాదశంతు గజాననమ్ ॥

ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠేన్నరః ।
నచ విఘ్నభయం తస్య సర్వసిద్ధికరం ప్రభో ॥

విద్యార్థీలభతే విద్యాం ధనార్థీలభతే ధనమ్ ।
పుత్రార్థీలభతే పుత్రాన్ మోక్షార్థీలభతే గతిమ్ ॥

జపేత్ గణపతిస్తోత్రం షడ్భిర్మాసైః ఫలంలభేత్ ।
సంవత్సరేణ సిద్ధించ లభతే నాత్ర సంశయః ॥

అష్టభ్యో బ్రాహ్మణేభ్యశ్చ లిఖిత్వాయం సమర్పయేత్ ।
తస్య విద్యా భవేత్ సర్వా గణేశస్య ప్రసాదతః ॥

(ఇతి శ్రీ నారద పురాణే సంకష్టనాశన గణేశస్తోత్రం సంపూర్ణం)

## ఏకదంతుడు ఎలా అయ్యాడు?

కార్తవీర్యుని వధించిన అనంతరం పరశురాముడు తన గురువు అయిన పరమశివుణ్ణి దర్శించుకోవాలని కైలాసం వెళ్ళాడు. ఆ సమయానికి శివపార్వతులు ఏకాంతంలో ఉన్నారు. బయట కాపలా కాస్తున్న గణపతి పరశురాముడిని ఇప్పుడు లోపలికి వెళ్ళడానికి వీలుపడదని నివారించాడు. "పరమేశ్వరుడిని దర్శించు కోకుండా అడ్డగించడానికి నీవెవ్వడివి" అంటూ పరశురాముడు ధిక్కరించాడు. మాటా మాటా పెరిగి అదికాస్తా యుద్ధానికి దారి తీసింది. గణపతి తన తొండంతో పరశురామున్ని పైకి ఎత్తి పడవేశాడు. పరశురామునికి కళ్ళు బైర్లుకమ్మాయి. ఆగ్రహించిన



పరశురాముడు తన చేతిలోని గండ్రగొడ్డలిని గణపతిపై ప్రయోగించడంతో ఒక దంతం ఊడిపడింది. ఆ చప్పుడుకు ఉలిక్కిపడిన పార్వతీ పరమేశ్వరులు శయన మందిరం నుంచి బయటికి వచ్చారు. నెత్తురోడుతున్న బాల గణపతిని ఎత్తుకొని పార్వతి పరశురాముడిని మందలించింది. తన వల్ల జరిగిన అపరాధాన్ని మన్నింపమని పరశురాముడు వేడుకున్నాడు. అంతటితో ఆ కథ సమాప్తమైనా గణపతి మాత్రం ఒక దంతం పోగొట్టుకొని 'ఏకదంతుడి' గా పేరు పొందాడు. ■

## ఎలుక గుర్రపు స్వామి



**పిం**డితో చేసి ముద్దుల పిల్లవాని
ప్రాణమును పోసి మురిసెను పార్వతమ్మ
తండ్రిచే త్రుంచబడినట్టి తలకు బదులు
దంతి శిరముంచబడెనంట ఎంత వింత

తల్లిదండ్రుల ముద్దుల తనయుడతడు
ప్రమధ గణముల గౌరవపాత్రుడతడు
చల్లగా చూచు భక్తులనెల్ల నతడు
బొజ్జ గణపతియనబడు గుజ్జువేల్పు

చెరకు వడపప్పులన వచ్చు పరుగు లిడుచు
ఏనుగులు అశ్వములు నాకు ఏలటంచు
ఎలుకనే గుర్రముగచేసి యేగుచుండు
విఘ్నపతిగొల్వగలుగును విజయమెపుడు

మారేడు పత్రముల్ మరిమరి తెమ్మను
        దానిమ్మ పూలపై తగని ప్రీతి
దేవకాంచనపూల దేహముప్పొంగును
        తామరతూడుకు తలను వంచు
దర్భపోచల మీద తగని మక్కువ జూపు
        వుమ్మెత్త పూలకు వుబ్బిపోవు
గన్నేరు పూలను ఎన్నైన తెమ్మను
        వుత్తరేణిని గాంచ చిత్తమలరు
పండ్లు ఫలహారములకన్న భక్తులిచ్చు
పచ్చి గరికెనె తానెంతొ మెచ్చుకొనును
అల్పసంతోషి అందరి యాత్మబంధు

ఎలుక వాహనమెక్కి యేగుచుండు నెవండు
        పత్రిపూజలనందు ధాత్రినెవడు
అమ్మ పార్వతిదేవి అనుగు పుత్రుండెవడు
        ప్రమధ గణాలకు ప్రథముడెవడు
ముక్కంటి మెప్పించు ముద్దుకుర్రడెవండు
        ఆది పూజలనందు నాతడెవడు
ఎల్లజనులను గాచు ఏకదంతుడెవండు
        విఘ్నములను బాపు వీరుడెవడు
కుడుములుండ్రాళ్ళనిచ్చిన కులుకునెవడు
గజముఖంబును గల్గిన ఘనుడెవండు
వేల్పులందరు పూజించు వేల్పు ఎవడు
అట్టి దేవుని గొల్తునే ననవరతము

# శ్రీ విఘ్నేశ్వర దండకం

శ్రీ మన్మహారాజ రాజశ్వరీదేవి యంకంబులో స్తన్య పానంబుతో తన్మయత్వంబునన్ అంతులేనట్టి వాత్సల్య దుగ్ధాంబుధిన్ దేలియాడంగనిన్ జేరి యర్చించు భక్తావళిన్ సర్వవిఘ్న ప్రకాండంబులన్ రూపుమాయించి నానా వరంబుల్ ప్రసాదించి ఈరేడు లోకాల శోకాలు మాన్పించి రక్షించు చున్నట్టి యో విఘ్నరాజా భవత్పాద మందార మకరంద మాశించి నానేత్రభృంగంబులీనాడు వ్రాలెన్ కారుణ్య సారంబు ప్రసరించి కాపాడగా రమ్ము నీవానిగా నన్ను జేకొమ్ము వేదవేదాంగ వేదాంత సారంబులన్ సర్వశాస్త్రార్థ సద్విద్య సందోహముల్ నిన్ను మూలంబుగా గౌరవస్థాన మందుంచి పూజించు ముల్లోకమందెవ్వరేమైన సత్కార్య కర్మంబు జేయంగ మున్ముందుగా నీదునామంబు కీర్తించి యర్చింత్రు, నీ నామమే సర్వగీర్వాణ సంపూజ్యమై నిత్య సన్మంగళ ప్రాభవంబై ప్రకాశించు నీ రూపు సేవించి యంభోజ సంజాతుడున్ నిర్జరేంద్రుండు నానా విదార్థంబులన్ బొంది సంతోషమున్నందు, రెల్లపడున్ దేవదేవారులున్, యక్షగంధర్వ గరుడోరగాదుల్ భవన్మాయ దెలియంగ లేకెంతయో విస్మయాంతాత్ములై యుందురో దేవ షాణ్మాతురుండపడు యుష్మత్ప్రభావంబు శంకించి అవనీతలం బొక్క నిమిషంబులో తివిరి నేవత్తునంచున్ మనోవేగ మొప్పారగాబోవ నీవంతలో భక్తియుక్తండవై శైలరాజేంద్రతనయన్ జగన్మాతకున్ మందగమనంబుతో జుట్టిరాగా, మహాదేవుడే నీ మహాత్వంబపూర్వంబుగా సుస్థిరత్వంబుగా చాటడామున్ను! రజతాచలేంద్రాగ్ర భాగంబునన్ శారదేందుప్రభా భాసితాశావకాశంబునన్ సహజ గాంభీర్య గమనంబుతో సంచరింపంగ దర్శించి సనకాది సన్మౌనిబృందంబు పూర్ణేందుబింబంబు నిర్జించు నీ యొక్క మత్తేభవక్త్రంబు నీ గుజ్జురూపున్ తదేకంబుగా జూచి యానందమున్ బొందదా! తారకానాధుడానాడు సౌందర్యశోభా సమోపేత శృంగార సర్వాంగుడై తన్ను కాంతా సమూహంబు మోహంపు చిరునవ్వుతో మంచి నీరాజనంబుల్ సమర్పింపగా అన్నుమిన్నేమియున్ గానగాలేక నీ హ్రస్వరూపంబు వీక్షించి నవ్వంగ నా వారిజారిన్ భవత్కోపదావాగ్ని కిన్నాహుతిన్‌జేయ నుంకించినన్ భీతిచే గర్వమంతన్ విసర్జించి దాసోహమంచున్ నినున్ జేరగా పార్వతీనాధు జూటాగ్ర చూడామణిన్ జూచి వర్షవర్షంబునన్ భక్తియుక్తంబుగ సర్వపుష్పంబులన్, సర్వ పత్రంబులన్, ద్రాక్ష, జంబీర, నారంగ, రంభాది నానాఫలంబుల్ సమర్పించి యర్చించు సద్భక్త బృందంబులన్, శోభనంబుల్ ప్రసాదించి రక్షింతు నంచున్ వచింపంగ, నీలదాకాశ మధ్యంబులో నుండి విద్యుల్లతా భాసురాంగుల్ నిలింపాగనల్ దివ్య ప్రసూనంపు వర్షంబు వర్షించి హర్షింపరా!



మోదకాఖాది మూషికారోహణానందలోలుండవై ముమ్మూర్తులన్ మూడు లోకంబులన్ మంత్రముగ్ధాత్ములన్ జేయవానీవు! ద్వారకానాధుడానాడు సత్రాజితున్ జేరరావించి నీ ఇంటిలో భానుదత్తం బనావృష్టి వార్యంబుగానున్న మణిరాజమిమ్మన్న, మోమాటమింతైన బాటింపకన్ వాడుశౌరిన్ తిరస్కార వాక్యంబులన్ బల్కె నొక్కింతకాలంబుమీదన్ ప్రసేనుండు తమ్ముండు మణిబూని చరియించుచుండంగ కాంతార మధ్యంబులో సింగ మొక్కండు దుష్టోగ్రదంతంబులన్ వానికాయంబు గాయంబుగా జేసి వధియింప, సత్రాజితుండీయదార్థంబు నింతైన గుర్తింపకన్ కృష్ణుడే వాని ప్రాణంబులన్ దీసి మణిగొన్న వాడంచు దుష్ట ప్రచారంబు గావింపగా, రుక్మిణీవల్లభుండాత్మ చింతించి "యేపాప మేమాత్ర మెరుగంగలేనైన దుష్కీర్తివాటిల్లె యోపార్వతీపుత్రయో మేరుగంభీర సద్గాత్ర పాపంబు పుణ్యంబులన్, సర్వకర్మంబులన్ సాక్షివీవేకదా" యంచు ప్రార్థించి, షడ్రసోపేత మృష్టాన్నముల్, పంచ బక్ష్యంబులన్, భక్తినైవేద్యమర్పించి పూజించి, ఘోరాటవిన్ బాగుగాలించి గాడాంధకార ప్రపూర్ణంబునై దుర్గమంబై పాదసంచారియై పోయి, యుద్ధంబులో సాటిలేనట్టి మేటిన్ మహాకాయు భల్లూకనాధున్ కడున్‌నొవ్వగాజేసి మెప్పించి, భానురత్నంబుతో భామతో వచ్చి నిర్ముక్త పాపుండునై కీర్తిధాముండునై యొప్పె భవత్కర్ణ సంచాలనోద్భూత ఝుంఝూనిలం బస్మదీయంపు పాపౌఘ సంజన్య దురితావళిన్ పంచబంగాళ మొనరించు సొంపుతావుల్ గుబాళించు పుష్పంబులా లేవు అర్పింప నామస్తకంబీదు చరణంబులందుంచినాడన్ భవత్ప్రీతిగా నేలుకోవయ్య యో సిద్ధి గణనాథ సర్వ కార్యార్థసిద్ధిన్ ప్రసాదించి రక్షింపుమోదేవ నిన్నెంత కీర్తించినన్ తృప్తియేలేదు మాకింత సంసార మోహంబులో నుండి కూపస్థ మండూకలీలన్ గృహంబున్ విశాల ప్రపంచంబుగా నెంచి నీపాదకంజంబులన్ మ్రొక్కి పూజింపగా నిశ్చలత్వంబు శూన్యంబు అజ్ఞాన తిమిరాంధకారంబులో పూర్ణజ్యోతి స్వరూపంపు నీవే కదా మమ్ము దరిజేర్చి గాపాడుమో ఏకదంతా, బృహత్కీర్తిమంతా సదా విఘ్నహర్తా జగత్కార్యకర్తా నమస్తే నమస్తే నమస్తే నమః.

# అంతుపట్టని వింత దేవుడు

మన దేవతలలో మొదట పూజించేది గణేశుడినే. మొదట మనం స్మరించేది కూడా ఆయన్నే. పూర్ణకుంభం లాంటి ఆ దేహం, బానవంటి ఆ కడుపు, పరిపూర్ణమైన ఈ జగత్తుకు గుర్తు. ఏనుగు తల, సన్నని కళ్ళు, సునిశిత పరిశీలనకు, మేథస్సుకు సంకేతాలు. ఆ వక్రతుండము, ఓంకార ప్రణవనాదానికి ప్రతీక. ఏనుగు లాంటి ఆకారాన్ని మోస్తున్నది ఒక చిన్న ఎలుక. అదే 'ఆత్మ' లోని చమత్కారం. ఆ పొట్టను చుట్టి వుండే నాగము (పాము) శక్తికి సంకేతం. జగత్తునంతా ఆవరించి వున్న మాయాశక్తే ఈ నాగము. నాల్గుచేతులు మానవాతీత సామర్థ్యాలకు, తత్త్వానికి సంకేతం. చేతిలో వున్న పాశ, అంకుశములు బుద్ధి, మనస్సులను సన్మార్గంలో నడిపించు సాధనాలకు ప్రతీకలుగా నిలుస్తాయి. మరో చేతిలో కనిపించే దంతం ఆయనదే. వ్యాస భగవానుడు మహాభారతం రాయసంకల్పించినప్పుడు తన దంతాన్నే విరిచి ఘంటంగా మార్చాడు. ఇదంతా విజ్ఞానం కోసం చేయవలసిన కృషికి, త్యాగానికి సంకేతాలు. మరొక చేతిలో కనిపించే మోదకం-ఉండ్రాయి ఉంటుంది. కొందరి మతం ప్రకారం అది కపిత్థం (వెలక్కాయ) ఏదిఏమైనా పైనచూస్తే గట్టిదనం లోపల తియ్యదనం ఉండేదనడానికి సంకేతం. గణేశునికి మూడు కళ్ళు, మూడవ కన్ను జ్ఞాన నేత్రం. చేటలంత చెవులు మొరలాలించే ఆ దేవుడి ప్రత్యేకతను సూచిస్తాయి. నిజం చెప్పాలంటే- గణేశమూర్తి వినోదకరమేమోగాని సుందరం కాదు. అదికూడా ఒక సంకేతమే. బాహ్యాసౌందర్యానికి అంతర్గత మహోన్నతికి సంబంధం లేదని ఆ రూపం సూచిస్తుంది. వినాయకునికి సంబంధించి ఇంకో ప్రత్యేకతను ఇక్కడ చెప్పుకోవాలి. భక్తులు తక్కిన దేవతల ఎదుట తప్పులు చేసివుంటే క్షమించమని చెంపలు వేసుకోవడం ఉంది కానీ, వినాయకుని ఎదుట అంత మాత్రం చాలదు. చేసిన తప్పులకు మనకు మనం శిక్ష విధించుకుంటున్నట్లుగా గుంజీలు తీయడం ఆయనంటే మనకున్న భయభక్తులకు గుర్తు. ఇలా ఎన్నెన్నో ప్రత్యేకతలు, నిగూఢ సంకేతాలు కలిగిన అధినాయకుడు మన వినాయకుడే. ■



# అదృష్ట రత్నజ్యోతి

## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : **92465 82255**, ఫోన్ : **040-6522 5554**

**ఎ.ఎమ్., విజయవాడ.**

**మా అబ్బాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

నక్షత్రం మఖ. సింహరాశి.

1. 5 నుండి 25 వయసు వరకూ శుక్రదశ. విద్యనివ్వాల్సిన శుక్రుడు ఉచ్ఛపట్టి కూడా కేతు బుధుల వలన విద్యనివ్వడంలో కొంత అలసత్వం చూపడం జరుగుతుంది. బృహస్పతి అష్టమ స్థితి దీనికి మరింత దోహద పడుతుంది. ఆ కారణంగా పిజి ఉండదు. ఇంజినీరింగ్... డిగ్రీతో ఆగిపోతుంది.

2. ఇదే శుక్ర దశలో బుధుని కారణంగా విదేశయానానికి చేసే అన్ని ప్రయత్నాలూ విఫలమవుతాయి.

3. 24వ సంవత్సరంలో... అంటే శుక్రునిలో కేతువులో పిజిలో చేరి కూడా, కుజుని కారణంగా ఊహించని విధంగా మంచి ఉద్యోగం లభించి... పిజిని మధ్యలో వదిలి పెట్టడం జరుగుతుంది. అది మరెన్నటికీ పూర్తికావడం జరగదు.

ఇక శుక్ర దశలో మరో ముఖ్యమైన విషయం... తండ్రితో అంత బలమైన బంధం ఏర్పడకపోవడం పొడి పొడి మాటలు...



కుజ కేతు రవి రాహువుల పాప కర్తరి వలన తల్లి ఆరోగ్యం సదా బాధాకరం! ఆ కోణంలో తల్లి కొన్ని పరిహారాలు పాటించాలి.

4. ఇక 25 నుండి 31 మధ్య రవి దశ. దీనిలో విదేశాలకు వెళ్ళక తప్పని పరిస్థితి. అది ఒక సముద్ర తీర పట్టణమై ఉంటుంది. పంచమ శని వలన వివాహం ఆలస్యమవుతుంది. అంటే ఇక్కడ 28వ సంవత్సరంలో వివాహం.... రవిలో శనిలో. అమ్మాయి కుందనపు బొమ్మ!

ఏది ఏమైనా ఇక్కడ చార్ట్‌లో కుజ దోషం లేదు. ఆమెకు లేకుండా చూసుకోవాలి. పాదం మీద పుట్టుమచ్చ ఉంటుంది. అది అమ్మాయిని గుర్తించే ఒక అంశం. ఆమెకు ఉద్యోగం ఉంటుంది, అది కమ్యూనికేషన్స్‌కు సంబంధించి ఉంటుంది. పచ్చ ధరింపజేస్తే అది ధనయోగం కలిగిస్తుంది. ఏది ఏమైనా అదృష్టవంతురాలే భార్యగా లభించడం ఈతడి పూర్వజన్మ సుకృతం!

5. విదేశ నివాసం రవి దశ మొత్తం కొనసాగుతుంది. దానిలో 25 నుండి 27 వయసు మధ్య వృత్తిలో యోగం. మకుటం ఒక్కటే తక్కువ అన్నట్టుగా నడుస్తుంది. అయితే 28లో... అంటే వివాహానికి ముందు ఉద్యోగంలో ఒక మరిచి పోలేని అవమానం. బృహస్పతికి పరిహారాలు పాటించకపోతే అది ఎక్కడికయినా దారితీస్తుంది... ఉద్యోగరాహిత్యానికి సైతం!

ఏది ఏమైనా వివాహం నాటికి పరిస్థితి చక్కబడుతుంది అనుకుంటే, ఆ పిదప బుధాంతర్దశలో... అంటే 29, 30 ప్రాంతంలో తిరిగి అదే తంతు! నిజానికి దీనంతటికీ మూలకారణం 25, 27 మధ్య ఉద్యోగంలో అనుభవించిన రాజయోగం లాంటి స్థితే!

పతనాంతాః సముచ్ఛ్రయాః పెరుగుట విరుగుట కొరకే. చిన్న వయసులో లభించే అధికారం ధనం, మదం కలిగిస్తుంది.

6. 31 నుండి 41 మధ్య చంద్ర దశ.

భూతం భవ్యాయ కల్పతే...

రవి దశలో కలిగిన అనుభవాల ఫలితం...

నమో మాత్రే పృథివ్యై...

మాతృభూమికి నమస్కారం చెప్పుకుంటూ స్వదేశానికి వెనుదిరగడం!

చిన్నపాటి అశాంతి, అలజడి తప్ప ఈ దశ ధనం కురిపించడంలో, గృహొన్నిచ్చి మురిపించడంలో యోగిస్తుంది.

7. ఇక 41 నుండి 48 మధ్య నడిచే కుజ దశ వృత్తిలో రాణింపునిస్తుంది. అయితే ఆరోగ్యం మాత్రం పట్టించుకోకపోతే కొంపముంచుతుంది. సంతానం ఒక్కరే అయినా, ఆ కూతురికి ఈ కుజ దశ అనేక రకాలుగా మంచి చేస్తుంది.

ఏది ఏమైనా మెత్తని మాటే ఈ జాతకుని శక్తి. అది కొనసాగినంత కాలం అదృష్టం వెన్నుదన్నుగా వెన్నంటే ఉంటుంది.

వాచా ప్రుషావసు!!!

ఆంధ్రజ్యోతి
శ్రీవినాయక పూజావిధానము



# మహిమాన్వితం ... కాణిపాక పుణ్యక్షేత్రం

వరసిద్ధి వినాయకుడు కొలువైన కాణిపాకం మహా మహిమాన్విత పుణ్యక్షేత్రంగా ఖండాంతర ఖ్యాతి పొందు తోంది. జిల్లా కేంద్రమైన చిత్తూరుకు 11 కిలోమీటర్ల దూరంలో ఐరాల మండలం కాణిపాకం గ్రామంలో పవిత్ర బాహుదా నదీ తీరాన వెలసిన వినాయకుడి ఆలయం ప్రాచీన కాలం నుంచీ సత్య ప్రమాణాలకు పేరొందింది. నిరంతరం ఉబికివచ్చే పాతాళ గంగ నడుమ బావిలో స్వయంభువుడుగా వెలసిన ఇక్కడి వినాయకుడు భక్తుల కోరికలు తీర్చే కొంగుబంగారమై విరాజిల్లుతున్నాడు. శివకేశవ నిలయమైన ఈ పుణ్యక్షేత్రానికి వెయ్యేళ్ళకు పైబడిన చారిత్రక, ఆధ్యాత్మిక నేపథ్యముంది. తిరుమల, శ్రీకాళహస్తి వంటి ఆలయాలతో ఆధ్యాత్మిక కేంద్రంగా మారిన చిత్తూరు జిల్లాకు మరింత వన్నె తెస్తున్న కాణిపాకంలో వినాయక చవితి సందర్భంగా బ్రహ్మోత్సవాలు ఏటా అంగరంగ వైభవంగా జరుగుతాయి.

### ఆలయ నేపథ్యం

బాహుదా నదీ తీరాన ఓ చిన్నపాటి గ్రామమైన కాణిపాకంలో పూర్వకాలంలో ముగ్గురు అన్నదమ్ములుండేవారు. వారిలో ఒకరు అంధుడు కాగా మరొకరు మూగవాడు. ఇంకొకరు బధిరుడు. ఇలా పుట్టుకతోనే వైకల్యం కలిగిన వారికి నదీతీరాన 'కాణి' (ఎకరాలో పాతిక వంతు) భూమి వుండేది. అందులోనే వున్న బావి నీటితో భూమి సాగయ్యేది. ఓసారి వర్షాలు పడక బావిలో నీరు తగ్గిపోవడంతో దాన్ని లోతు చేసేందుకు అన్నదమ్ములు ముగ్గురూ పలుగులూ పారలూ చేతబట్టి పనిలోకి దిగారు. తవ్వుతుండగా ఇసుక పొరల్లో రాయి అడ్డువచ్చింది. దాన్ని తొలగించే క్రమంలో పలుగుపోటుకు ఆ రాయి రక్తం స్రవించింది. ఆ రక్త స్పర్శతో వారి అంగవైకల్యం మటుమాయమైంది. విభ్రాంతికి గురైన ఆ అన్నదమ్ములు విషయాన్ని గ్రామస్తులకు తెలిపారు. హుటాహుటిన బావి దగ్గరకు చేరుకున్న గ్రామస్తులు ఇసుకను తొలగించి చూడగా ఇరుకైన రాతి బావిలో నుంచి స్వయంభువుగా వెలసిన వినాయకుడు దర్శనమిచ్చాడు. భక్తి పారవశ్యానికి లోనైన ఆ ప్రజలు వినాయకునికి పూజలు చేసి అసంఖ్యాకంగా కొబ్బరికాయలు కొట్టడంతో తీర్థపు నీళ్ళు ఆ పొలాన్నంతా తడిపేశాయి. ఇలా తీర్థపు నీరు కాణి వైశాల్యమున్న పొలమంతా పారింది కనుక అప్పటినుంచి ఆ ప్రాంతానికి కాణిపాకం అనే పేరు ప్రాచుర్యంలోకి వచ్చింది. కాలక్రమంలో కాణిపాకం పుణ్యక్షేత్రంగా ఎదిగి దేశవిదేశాల నుంచి భక్తులకు, యాత్రికులను ఆకర్షిస్తోంది.

### పెరుగుతున్న మూలవిరాట్టు

స్వయంభువుగా వెలసినట్టు స్థానికులు విశ్వసిస్తున్న కాణిపాక



విద్యుత్ కాంతి వెలుగుల్లో కాణిపాక వినాయక ఆలయం

వినాయక స్వామి మూలవిరాట్టు ఇప్పటికీ బావిలోనే వుంది. బావిపైనే గర్భగుడి నిర్మించారు. బావిలో స్వామి వారి చుట్టూ నిత్యం నీరు ఉబికి వస్తూంటుంది. దేవుడి అభిషేకాది పూజలన్నింటికీ ఈ నీటినే వినియోగిస్తున్నారు. స్వామిని దర్శించుకునే భక్తులకు అర్చకులు బావిలో వెలసిన స్వామి వారిని, ఆయన చుట్టూ ఉబికి వస్తున్న నీటిని చేయి పెట్టి తోడి మరీ చూపించి స్థల మహాత్మ్యం వివరిస్తుంటారు. ఈ నిదర్శనాలకు తోడు స్వామివారు స్వయంభువు అని చెప్పడానికి మరిన్ని ఆధారాలు సజీవంగా కనిపిస్తున్నాయి. స్వామివారి మూలవిరాట్టు శిల్పి చెక్కిన శిల్పంగా తోచదు. కేవలం స్వామి వారి ఆకారం కలిగిన సహజశిలనేది చూడగానే ఎవరైనా చెప్పే రీతిలో వుంది. అంతేకాకుండా మూలవిరాట్టు క్రమంగా పెరుగుతోంది. ఆలయానికి పొరుగునే వున్న తవణంపల్లె మండలం అరగొండ గొల్లపల్లె గ్రామానికి చెందిన బెజవాడ శిద్ధయ్య భార్య లక్ష్మమ్మ 1945లో స్వామివారికి చేయించిన వెండి కవచం తర్వాత కొంత కాలానికే స్వామివారి ఆకారానికి సరిపోలేదు. దాని తర్వాత పలువురు భక్తులు కవచాలు చేయించారు. అవికూడా తర్వాత స్వామివారికి సరిపోవడం లేదు. ఇలా ఎప్పటికప్పుడు స్వామివారి మూలవిరాట్టు పెరుగుతూ పోతున్నందున ఆ కవచాలు ఇపుడు మూషిక మండపంలో భక్తుల ప్రదర్శనకు మాత్రమే వినియోగిస్తున్నారు.

స్వామివారి మూలవిరాట్టు ఎప్పుడు వెలుగు చూసిందో, స్థానికులు ఆలయ నిర్మాణం ఎప్పుడు చేపట్టారో, తర్వాత ఎన్నిసార్లు పునరుద్ధరణలు జరిగాయో తెలియదుకానీ అందుబాటులో వున్న శాసనాధారాల ప్రకారమైతే ఆలయానికి వెయ్యేళ్ళకు పైబడిన చరిత్ర వుంది. 11వ శతాబ్దంలో చోళరాజు మొదటి కుళోత్తుంగుడు ఇక్కడ ఆలయం నిర్మించారు. తర్వాత 14వ శతాబ్దంలో విజయనగర రాజులు దాన్ని మరింత అభివృద్ధి పరిచారు. కాణిపాకంలో చోళ, పాండ్య, గంగ రాజులకు సంబంధించిన మూడు శాసనాలు లభించాయి. చోళ శాసనంలో కాణిపాకం 'కావణిపాక్కం' అని పిలువబడింది. మరో శాసనంలో కాణిపాకంలోని ఇతర ఆలయాలైన మణివణ్ణేశ్వర, పార్థీశ్వర ఆలయాల ప్రసక్తి కూడా వుంది.

# నిర్లక్ష్యం చేస్తే వెన్నునొప్పి నిర్జీవం చేస్తుంది


డాక్టర్ వర్ధన్
MD (Ayu); MS (C&P)




మానసిక ఒత్తిడిగురించి ఎప్పుడూ మాట్లాడుకుంటాం. కానీ, శారీరక (బయోలాజికల్) ఒత్తిడి మాటేమిటి? వాస్తవానికి ఈ ఒత్తిడే శరీరాన్ని అమితంగా దెబ్బతీస్తూ ఉంటుంది. శరీరంలోని వ్యవస్థలన్నిటినీ సజావుగా నడిపించే ఒక అద్భుతమైన వ్యవస్థ ఒకటి శరీరంలో ఉంది. మౌలికంగా, శరీరంలో నిరంతరం జరిగే జీవరసాయన (బయోకెమికల్) ప్రక్రియలు అలా సజావుగా, నార్మల్‌గా జరగడాన్ని హోమియో స్టేసిస్ అంటారు. అయితే ఎప్పుడైతే ఈ జీవరసాయన ప్రక్రియలు తమన సహజ స్థితిని, సాధారణత్వాన్ని కోల్పోతాయో అప్పుడే ఈ శారీరక ఒత్తిడి మొదలవుతుంది. హోమియోస్టేసిస్ దెబ్బతినడానికి బాహ్యమైన కారణాలు, శరీర అంతర్గత కారణాలు, ఏదైనా బలంగా గాయం కావడం, లేదా మానసిక కారణాలు ఇలా ఏకారణాలైనా ఉండవచ్చు. ఇవే కాకుండా, శరీరం ఇన్‌ఫెక్షన్ల బారిన పడటం, వైరస్‌కు గురికావడం కారణం కావచ్చు. ఆహార లోపాలు, నిద్రలేమి కూడా కారణం కావచ్చు. కొన్ని సార్లు దీర్ఘకాలికంగా ఉంటూ వస్తున్న శరీరంలోని ఏదో ఒక భాగంలో ఉంటూ వస్తున్న నొప్పి కూడా కారణం కావచ్చు. ఏ వ్యాధి అయినా వాత పిత్త కఫాల వైషమ్యం అంటే అవి తమ సహజ స్థితిని కోల్పోవడం వల్లే తలెత్తుతుంది. జీవక్రియలు అంటే జీర్ణక్రియ నుంచి విసర్జన దాకా, శ్వాసక్రియ నుంచి, నరాల వ్యవస్థ దాకా ఎక్కడ ఏ తేడా వచ్చినా శరీరం రోగగ్రస్తమవుతుంది.

## వెన్నునొప్పిలో ఏం జరుగుతోంది?

శరీరంలోని ఇతర భాగాల్లో నొప్పి రావడం వేరు. వెన్నునొప్పి రావడం వేరు. శరీరానికీ, మెదడుకూ ఒక వంతెనలా ఉండే వెన్ను మొత్తం శరీరంలోనే అత్యంత కీలకమైన విభాగం వెన్ను. దీర్ఘకాలికంగా ఉంటున్న నొప్పి వల్ల వాతం ప్రకోపితమవుతుంది. ఆ స్థితిలో శరీరంలో న్యూరో కెమికల్స్, న్యూరో ట్రాన్స్‌మీటర్లు మెదడులో విడుదల అవుతాయి. ఈ క్రమంలో మెదడు, అందులో భాగంగా ఉండే హైపోథాలమస్, పిట్యూటరీ, ఎడ్రినల్ గ్రంథుల మధ్య ఉండే సమన్వయం దెబ్బ తింటుంది. దీర్ఘకాలికంగా ఉండే నొప్పి, ప్రత్యేకించి వెన్నుభాగంలోని అక్యూట్ నొప్పి, కాస్తా క్రానిక్ నొప్పిగా మారిన తర్వాత హార్మోన్‌ల కేంద్రమైన ఎండోక్రైన్ వ్యవస్థ అంతా దెబ్బ తింటుంది. దీనికి తోడు గుండె రక్తనాళాలకు, కండరాలకు, నాడీవ్యవస్థకు, మానిసిక వ్యవస్థకు సంబంధించిన వ్యవస్థలన్నీ దెబ్బ తింటాయి. వీటిలో భాగంగా వ్యాధినిరోధక వ్యవస్థ కూడా తీవ్రంగా దెబ్బ తింటుంది.

## ఆయుర్వేదం ఏం చేస్తుంది?

వాత, పిత్త, కఫాల్లో వచ్చే వైషమ్యాలను అంటే తేడాలను, ధాతువుల్లో వచ్చే తేడాలను తొలగించి ఆయుర్వేదం వాటిని ఒక సామ్యావస్థకు తీసుకువస్తుంది. ఇతర విధానాలు శరీరంలోని వెన్నెముక, మెదడు వంటి ఏవో కొన్ని విభాగాలకే పరిమితమై వైద్యం అందిస్తున్నాయి. ఆయుర్వేదం అలా కాదు. మొత్తంగా శరీర వ్యవస్థలన్నిటినీ, సమస్త కణజాలానికీ వైద్యం చేస్తుంది. వెన్నెముకకే పరిమితం కాకుండా ఎముకలకు మూలమైన అస్థి ధాతువుకే పరిమితం కాకుండా, సప్తధాతువులకూ వైద్యం చేస్తుంది. అందుకే బయోలాజికల్ స్ట్రెస్, ఆ కారణంగా తలెత్తిన సమస్త సమస్యలూ తొలగిపోతాయి. వ్యాధిరూపం ధరించకముందే మూలకారణాన్ని, ఆ కారణంగా రాబోయే సమస్యలన్నిటికీ ఆయుర్వేదం చరమగీతం పాడుతుంది.

### శివకేశవ నిలయం

కాణిపాకం శివకేశవ నిలయంగా పేరు గాంచింది. ఇక్కడ వినాయక ఆలయానికి అనుబంధంగా మరో రెండు ప్రాచీన ఆలయాలున్నాయి. వాటికీ చారిత్రక ప్రాధాన్యం వుంది. అందులో ఒకటి వరదరాజస్వామి ఆలయం కాగా మరొకటి మణికంఠేశ్వరాలయం. వాస్తవానికి వినాయకుడు కొలువైన క్షేత్రాలను శైవక్షేత్రాలుగా పరిగణిస్తారు. అయితే సాక్షాత్తూ వినాయకుని ఆలయంలోపలే వీరాంజనేయస్వామి ఉపాలయం వుంది. ఇక ఆలయానికి వాయువ్య భాగాన వున్న మణికంఠేశ్వరాలయంలో మహాగణపతితో పాటు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ కొలువై వున్నారు. ఈశాన్య దిక్కున వున్న వరదరాజస్వామి ఆల యంలో శ్రీదేవి, భూదేవీ సమేత వరదరాజస్వామి వెలసి వున్నారు. దీంతో ఇదో అరుదైన శివకేశవ నిలయంగా పేరుతెచ్చుకుంది.

### బాహుదా నదికీ పురాణ నేపథ్యం

కాణిపాక క్షేత్రాన్ని స్పృశిస్తూ ప్రవహించే బాహుదా నది కూడా ఎంతో మహిమాన్వితమైనదని ప్రజల విశ్వాసం. పురాణాల్లోని శంఖ లిఖితులనే సోదరుల వృత్తాంతం దీన్ని బలపరుస్తోంది. పూర్వం శంఖుడు, లిఖితుడు అనే విప్ర సోదరులుండేవారు. దొంగతనానికి పాల్పడిన వారి చేతులను రాజు నరికించివేశాడు. పశ్చాత్తాపంతో, బాధతో అల్లాడుతున్న వారు కాణిపాక క్షేత్ర దర్శనానికి వెళ్ళి బాహుదా నదిలో స్నానమాచరించారు. పవిత్ర నదీజలాల మహిమ కారణంగా వారికి పోయిన బాహువులు తిరిగొచ్చాయి. కోల్పోయిన బాహువులను తిరిగిచ్చిన నది కనుకే బాహుదా అన్న పేరొచ్చిందనే కథ ఇక్కడి జనం నోళ్ళలో నానుతోంది.

### సత్యప్రమాణాల నిలయం

కాణిపాకం వినాయకుడి ఆలయం శతాబ్దాలుగా సత్యప్రమాణాలకు పేరొందింది. జిల్లాలో ఎవరి మధ్య ఏ చిన్న తగాదా వచ్చినా నిర్దోషిత్వ నిరూపణకు కాణిపాకంలో ప్రమాణం చేస్తానంటూ ముందుకు రావడం, లేదా ప్రమాణం చేస్తావా అంటూ సవాల్ చేయడం పరిపాటి. ఆలయంలో ప్రమాణం చేయాలంటే రూ. 516 వెచ్చించి టికెట్ కొనుగోలు చేయాలి. 2010-11లో ప్రమాణాల ద్వారా ఆలయానికి రూ. 22.37 లక్షలు ఆదాయం రాగా 2011-12లో రూ. 26.19 లక్షలు, 2012-13లో రూ. 27.32 లక్షలు, 2013-14లో రూ. 28.32 లక్షల ఆదాయం సమకూరింది. ఇలా ఏటేటా ఆదాయం పెరగడం సత్యప్రమాణాల స్వామిగా వినాయకుడికి ఉన్న మహిమకు నిదర్శనం. ఎందరో వ్యక్తిగత దుర్వ్యసనాల నుంచి విముక్తి పొందడానికి ఈ క్షేత్రం దారి చూపుతోంది. ఇక్కడ ప్రమాణం చేస్తే దానికి కట్టుబడి వుంటారనే నమ్మకం ప్రజల్లో బలంగా వుంది. తాగుడు, జూదం, వివాహేతర సంబంధాలు, దొంగతనాలు వంటి వ్యసనాలకు గురైన వారిని కుటుంబ సభ్యులు ఇక్కడికి తీసుకొచ్చి దేవుడి సమక్షంలో ఇకపై అలా చేయబోమంటూ ప్రమాణం చేయిస్తుంటారు. మాట తప్పితే అశుభం జరుగుతుందనే భయంతో చాలామంది ప్రమాణాలకు కట్టుబడి మంచిగా మారుతుంటారు. ఎన్నో కుటుంబాలకు, వ్యక్తులకు తద్వారా సమాజానికి ఇలా ఎంతోకాలంగా మంచి జరుగుతోంది. కాణిపాక వినాయక ఆలయం వివాహ వేదికగా వినుతికెక్కింది. ఇక్కడ



కాణిపాకంలోని మణికంఠేశ్వరాలయం




స్వామివారి ఈ కవచాలలో మొదటిది (ఎడమ వైపు నుంచి) 1945లో చేయించినది. కుడివైపు చివరున్నది తర్వాత చేయించగా మధ్యలో వున్న కవచం ఇటీవల చేయించినది.

వివాహం చేసుకోవడం ఎంతో శుభకరమని ప్రజలు భావిస్తుండడం వల్ల ఎక్కడెక్కడినుంచో వచ్చి వివాహ కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. దీంతో ఏటేటా పెళ్ళిళ్ళ సంఖ్య పెరుగుతోంది. ఇతర ప్రాంతాల్లో పెళ్ళిళ్ళు చేసుకునేవారు కూడా తొలుత శుభలేఖలను తెచ్చి ఇక్కడి దేవుడి వద్ద పెట్టి పూజ చేయించి తీసుకెళతారు. ఓ శుభలేఖను స్వామివారి హుండీలో వేశాకే ఇతరులకు పంచుతారు.

### బ్రహ్మోత్సవాల నిర్వహణా ప్రత్యేకమే

కాణిపాకంలోని వరసిద్ధి వినాయక ఆలయ బ్రహ్మోత్సవాలు కూడా దేశంలో మరెక్కడా జరగని రీతిలో 21 రోజులు పాటు జరుగుతాయి. ఆలయం చుట్టూ వున్న 14 గ్రామాలకు చెందిన ప్రజలు ఆలయానికి ఉభయదాతలుగా వ్యవహరిస్తున్నారు. ఏటా వినాయక చవితి పండుగ నాటి నుంచి వార్షిక బ్రహ్మోత్సవాలు మొదలవుతాయి. వీటిని దేవస్థానం నిర్వహిస్తుంది. 9 రోజులకు అవి ముగియగానే 11 రోజుల పాటు ఉభయదాతలు ప్రత్యేక ఉత్సవాలను కొనసాగిస్తారు.

### చవితి నుంచి వార్షిక బ్రహ్మోత్సవాలు

ఈ ఏడాది సెప్టెంబరు 5న వినాయక చవితి వేడుకలతో ఆలయ వార్షిక బ్రహ్మోత్సవాలు ప్రారంభమై 25వ తేదీ వరకూ జరగనున్నాయి. 5వ తేదీ సోమవారం వినాయక చవితి వేడుకల్లో ఉదయం అభిషేకం, సాయంత్రం పుష్ప కావళ్ళ సమర్పణ, రాత్రికి గ్రామోత్సవం ఉంటాయి. 6వ తేదీ మంగళవారం ఉదయం 7.30 గంటల నుంచి 8.15 గంటల నడుమ స్వాతి నక్షత్రం, కన్యా లగ్నంలో ధ్వజారోహణం, రాత్రి హంసవాహనంపై ఊరేగింపు ఉంటాయి. 7వ తేదీ బుధవారం రాత్రి నెమలి వాహనం, 8వ తేదీ గురువారం రాత్రి మూషికవాహనం, 9వ తేదీ శుక్రవారం ఉదయం చిన్న శేషవాహనం, రాత్రి శేష వాహనం ఉంటాయి. 10వ తేదీ శనివారం రాత్రి వృషభ వాహనం, 11వ తేదీ ఆదివారం రాత్రి గజవాహనం, 12వ తేదీ సోమవారం ఉదయం రథోత్సవం, 13వ తేదీ మంగళవారం ఉదయం భిక్షాండి, రాత్రి తిరుకళ్యాణం, అశ్వవాహనంపై ఊరేగింపు ఉంటాయి. 14వ తేదీ బుధవారం ధ్వజావరోహణం, సాయంత్రం అభిషేకం, వడాయత్తు ఉత్సవం, రాత్రికి ఏకాంత సేవ ఉంటాయి. ఇక్కడితో వార్షిక బ్రహ్మోత్సవాలు ముగుస్తాయి.

అయితే 15వ తేదీ నుంచీ ప్రత్యేకోత్సవాల పేరిట మరో 11 రోజులు ఉత్సవాలు కొనసాగుతాయి. 15న గురువారం రాత్రి అధికార నంది వాహనం, 16న శుక్రవారం రాత్రి రావణ బ్రహ్మ వాహనం, 17న శనివారం రాత్రి యాళి వాహనం, 18న ఆదివారం రాత్రి సూర్యప్రభ వాహనం, 19న సోమవారం రాత్రి చంద్రప్రభ వాహనం, 20న మంగళవారం రాత్రి కామధేను వాహనం, 21న బుధవారం రాత్రి పూలంగి సేవ, 22న గురువారం రాత్రి కల్పవృక్ష వాహనం, 23న శుక్రవారం రాత్రి విమానోత్సవం, 24న శనివారం రాత్రి పుష్ప పల్లకి సేవ, 25న ఆదివారం రాత్రి తెప్పోత్సవంతో ఈ ప్రత్యేకోత్సవాలు ముగుస్తాయి.

**- కవరకుంట్ల శివప్రసాద్**, స్టాఫ్ రిపోర్టర్, చిత్తూరు

ఫోటోలు: **ఎస్.శివకుమార్**, చిత్తూరు

## సయాటికా, నడుంనొప్పులకు చెక్

**నడుం** నొప్పి ఉంటే జీవితం నిర్జీవంగా మారుతుంది. నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం వెంట నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. కొన్నిసార్లు నడవడానికి, కూర్చోవడానికి ఇబ్బంది పడాల్సి వస్తుంది.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం.లుంబార్‌స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో నడుం నొప్పి శాశ్వతంగా పోతుంది.

## సుఖవ్యాధులకు చరమగీతం

**హెచ్ఐవి**

ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హెర్పిస్ నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది.


**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106




## మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాదు

**తలనొప్పి** వచ్చిందంటే చాలు తగ్గే వరకు మామూలు మనిషి కాలేరు. రోజూ నరకం అనుభవిస్తారు. వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పిఅంత తీవ్రంగా ఉంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాల్సి వస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతారు వికారం, వాంతులు, వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి.. మెదడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పెర్‌ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు అందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుంది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

## హెపటైటిస్ బి, సి, హెర్పిస్‌లపై విజయం

**హెపటైటిస్** అనగానే అందరికీ హెపటైటిస్ బి గుర్తుకువస్తుంది. కానీ అదొక్కటే కాదు అందులో చాలా రకాలున్నాయి. హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు :** ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బీ వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు. అంతేకాకుండా పెరిగిన వైరల్ లోడ్‌ను రోగనిరోధక వ్యవస్థ ద్వారా సమర్థంగా అడ్డుకోవచ్చు.

ADVT

# దేశవ్యాప్తంగా ఖ్యాతిగాంచిన ఖైరతాబాద్ గణపతి



తెలుగు రాష్ట్రాల్లో వినాయకచవితి అంటే మొదటగా మదిలో మెదిలేది భాగ్యనగరంలోని ఖైరతాబాద్ గణేశుడే. వినాయక చవితి సందర్భంగా ఖైరతాబాద్ భారీ గణపతికి 11 రోజుల పాటు నిర్వహించే ఉత్సవాలు లక్షలాది మందిని భక్తిపరవశుల్ని చేస్తున్నాయి. దేశవ్యాప్తంగా ఖ్యాతి గడించిన ఖైరతాబాద్ వినాయకచవితి ఉత్సవాలకు 62 సంవత్సరాల చరిత్ర ఉంది. భక్త కోటిపై తన కరుణ నిండిన చూపుల్ని ప్రసరింపజేస్తున్నట్టు కొలువు తీరే ఖైరతాబాద్ భారీ గణపతి ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు పొందడంతో పాటు ఎన్నో రికార్డులను సొంతం చేసుకున్నాడు.

### ఒక్క అడుగు నుంచి 60 అడుగుల దాకా..

ఖైరతాబాద్ గణపతి ఉత్సవాలు 1954లో ఒక అడుగు ఎత్తు గణేశుడి విగ్రహంతో ప్రారంభమయ్యాయి. అప్పట్లో ఖైరతాబాద్ కౌన్సిలర్ సింగరి శంకరయ్య స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా బాల గంగాధర్ తిలక్ ఇచ్చిన పిలుపు మేరకు ఖైరతాబాద్‌లో వినాయక విగ్రహాన్ని ఏర్పాటు చేసి ఉత్సవాలకు శ్రీకారం చుట్టారు. తొలి ఏడాది వినాయకుడి విగ్రహాన్ని పెట్టడమే కాకుండా నగరం మొత్తం తిరుగుతూ వినాయక నవరాత్రులను అందరూ ఘనంగా నిర్వహించాలని కరపత్రాలు పంచారు శంకరయ్య. అప్పటి నుంచి ఏటా వినాయకుడి ఎత్తు పెంచుతూ ఉత్సవాలు ఘనంగా నిర్వహిస్తున్నారు. 1979లో 20 అడుగుల వినాయకుడిని తయారుచేసి ఇక్కడ ప్రతిష్ఠించారు. 1981లో 25 అడుగుల నాట్య వినాయకుడు, 1982లో మూషిక వాహన వినాయకుడి ద్వారా ఖైరతాబాద్ గణపతికి రాష్ట్రవ్యాప్తంగా గుర్తింపు లభించింది. 1987 నుంచి వినాయకుడి ఎత్తును క్రమంగా పెంచుతూ వెళ్లారు. 2015లో 60 అడుగుల భారీ గణపతికి ఘనంగా వేడుకలు నిర్వహించారు.

సింగరి శంకరయ్య మరణానంతరం అతడి సోదరుడు సింగరి సుదర్శన్ ఆధ్వర్యంలో ఈ ఉత్సవాలు జరుగుతున్నాయి. అప్పట్లో హైదరాబాద్‌లో కేవలం పాతబస్తీ, రాంకోట్, ధూల్‌పేట, ఖైరతాబాద్‌లలో మాత్రమే ఈ ఉత్సవాలు జరిగేవి. 1985 వరకు ఖైరతాబాద్ భారీ గణపతిని నెల రోజుల పాటు పూజించి విజయదశమి (దసరా) రోజున నిమజ్జనం చేసేవారు. అప్పట్లో ఈ వినాయకుడి వద్ద నెల రోజుల పాటు సాంస్కృతిక కార్యక్రమాలు రాత్రంతా జరిగేవి. నిమజ్జనం ముందు రోజున జరిగే శివతాండవాన్ని చూసేందుకు పెద్ద ఎత్తున భక్తులు వచ్చేవారు. 1954లో వినాయకుడిని ఓ చిన్న పాడుబడ్డ దేవాలయం ఎదురుగా (ప్రస్తుతం గ్రంథాలయంలో) ప్రతిష్ఠించేవారు. ఆ దేవాలయంలో అసలు రూపం ఎవరికీ తెలియకున్నా గణపతి దేవాలయంగా భావించి సింగరి శంకరయ్య అక్కడ ఎప్పటికీ చిరస్థాయిగా నిలిచిపోయే భవనాన్ని నిర్మించాలని సంకల్పించి అజంతా శిల్పాల్లోని 19వ గుహ ఆకారంలో గ్రంథాలయ భవనాన్ని నిర్మించారు. నిర్మాణంలో ఉన్న సమయంలో ఈ భవనం కింది అంతస్తులో 10 అడుగుల వినాయకుడిని పెట్టేందుకు అనువుగా ప్రత్యేక ఏర్పాటు చేశారు. రానురాను భక్తుల ఆదరణ పెరగడం, ప్రజల డిమాండు మేరకు ఎత్తును పెంచాల్సి రావడంతో ఈ గ్రంథాలయ ఆవరణలో వినాయకుడిని ప్రతిష్ఠిస్తున్నారు.



సింగరి శంకరయ్య

### శ్రీ శక్తిపీఠ శివనాగేంద్ర మహాగణపతి

లక్షలాది మంది భక్తులు ఊహించిన విధంగానే ఈసారి కూడా ఖైరతాబాద్ మహాగణపతి సర్వాంగసుందరంగా ముస్తాబయ్యాడు. శ్రీ శక్తిపీఠ శివనాగేంద్ర మహాగణపతి అవతారంగా గణపతిని 58 అడుగుల ఎత్తు, 34 అడుగుల వెడల్పుతో శిల్పి రాజేంద్రన్, బృందం రాత్రింబవళ్లు శ్రమించి విగ్రహాన్ని తీర్చిదిద్దారు. కేవలం రంగులు మినహా గణపతి విగ్రహ తయారీ పూర్తయ్యిందని తెలిపారు. భారీ ఆకారంతో

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

చల్లని వాతావరణం ఏర్పడినప్పుడు, చాలా మంది శ్వాసకోశ సమస్యలతో బాధపడుతుంటారు. అటువంటి శ్వాసకోశ సమస్యలలో ఎక్కువ మందిని వేధించే సమస్య 'అలర్జిక్ రైనైటిస్'. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 10 నుండి 30 శాతం వరకు ప్రజలు ఈ సమస్యతో బాధపడటం జరుగుతోంది. ఆహారపు అలవాట్లను మరియు జీవన సరళిని కొంతమేరకు మార్చుకోవడం, శీతల పానీయాలు సేవించకపోవడం వంటి జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ, 'అలర్జిక్ రైనైటిస్' బాధితులు తీవ్ర ఇబ్బందులకు గురికావడం జరుగుతుంటుంది. వారు ఈ తరహా సమస్య వలన, తమ రోజువారీ దినచర్యలలో సైతం ఎన్నో ఆటంకాలు ఎదుర్కోవటం జరుగుతుంది.



సాధారణంగా మానవ శరీరంలోని రోగనిరోధక వ్యవస్థ యొక్క అసందర్భ ప్రతిచర్యను అలర్జీ అంటారు. అంటే ఏదైనా ఒక పదార్థానికి, మన శరీరం సాధారణ స్థితి కంటే ఎక్కువగా ప్రతిక్రియను జరపడం. అలా ప్రభావితం చేసే పదార్థాన్ని 'అలర్జెన్' అని, అలాంటి ప్రతిచర్యను 'అలర్జిక్ రియాక్షన్' అని పిలవడం జరుగుతుంది.

**అలర్జిక్ రైనైటిస్ అనగా:** ఏవైనా అలర్జెన్‌లు శ్వాస ద్వారా శరీరంలోకి ప్రవేశించినప్పుడు, రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడం వలన ముక్కులోని శ్లేష్మపు పొర శోథమునకు గురి కావడాన్ని 'అలర్జిక్ రైనైటిస్' అంటారు. **అలర్జిక్ రైనైటిస్ 2 రకాలు. (1) సీజనల్ అలర్జిక్ రైనైటిస్ :** కేవలం ఒక ప్రత్యేకమైన కాలంలో మాత్రమే అలర్జీకి గురి కావడాన్ని సీజనల్ అలర్జిక్ రైనైటిస్ అంటారు. పుప్పొడి రేణువుల వలన ఇది ఎక్కువగా కలుగుతుంది. **(2) పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్ :** సంవత్సరం పొడవునా ఏ కాలంలోనైనా ఏర్పడటానికి అవకాశం ఉండే అలర్జీని పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్ అంటారు. దీనికి గురి కాబడినవారి శరీరం, దుమ్మూ-ధూళి వాతావరణానికి, జంతుకేశాలు మొ॥ అలర్జెన్‌లకు సున్నితంగా స్పందించడం జరుగుతుంది.

**కారణాలు:** అలర్జెన్‌లు శరీరంలోకి ప్రవేశించినప్పుడు, వాటినుండి రక్షణ కల్పించేందుకు, హిస్టమిన్ అనే రసాయనం విడుదల అవుతుంది. దీనివలన అలర్జీ సమస్య ఉత్పన్నమవటం వలన అలర్జీ లక్షణాలు కనిపిస్తాయి. • పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువులు, దుమ్మూ-ధూళి, బూజు, జంతుకేశాలు, వాతావరణ కాలుష్యం, వాతావరణంలో మార్పులు, చల్లని గాలి, సుగంధ ద్రవ్యాలు (Perfumes), వృత్తిరీత్యా కొన్ని వాయు కాలుష్యాలకు గురికావడం, పొగ త్రాగటం, కుటుంబ చరిత్ర వంటి అంశాలన్నీ ఈ సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** అధిక సంఖ్యలో తుమ్ములు రావడం, ముక్కు కారడం లేదా ముక్కు దిబ్బడ, ముక్కు మరియు కళ్ళు దురదగా ఉండటం, కళ్ళ వెంబడి నీళ్ళు రావడం, దగ్గుతో పాటుగా గొంతులో దురదగా ఉండటం, కళ్ళచుట్టూ నల్లని వలయాలు ఏర్పడటం, తరచూ తలనొప్పి, ముఖం వాపుగా ఉండటం, నీరసం, ఒళ్ళు నొప్పులు మరియు మగతగా ఉండటం. • చర్మం ఎక్కువగా పొడిబారటం, దురదగా ఉండటం మరియు బొబ్బలు ఏర్పడటం వంటి ఎగ్జిమా లక్షణాలను కూడా గమనించవచ్చు.

**దుష్ఫలితాలు:** చిన్న పిల్లలు దీర్ఘకాలికంగా ఈ వ్యాధి బారిన పడితే, వారిలో ఇది ఆస్తమాకు దారి తీసే అవకాశం ఉండటం మరియు సైనసైటిస్, చెవిలో ఇన్‌ఫెక్షన్‌లు (Otitis Media), నిద్రలేమి, దంత సమస్యలకు దారితీయడం వంటి దుష్పరిణామాలు ఎదురవుతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** చాలా వరకు రోగి యొక్క లక్షణాలను బట్టి వ్యాధిని నిర్ధారించవచ్చు. సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., అబ్‌సెల్యూట్ ఇసినోఫిల్ కౌంట్ • Radio Allergo Sorbent Test (RAST) ద్వారా మన శరీరంలో ఒక అలర్జెన్‌కు ఎంత వరకు IGF Antibodies ఉన్నాయో తెలుసుకోవడం ద్వారా కూడా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** పుప్పొడి రేణువులు ఎక్కువగా ఉండే కాలంలో బయటకు ఎక్కువగా వెళ్ళకపోవటం. • ఉదయాన్నే బయటి వాతావరణంలో వ్యాయామాలు చేయకపోవడం • బయటకు వెళ్ళివచ్చిన వెంటనే స్నానం చేయడం • 'ముక్కు'కు మరియు 'నోటి'కి మాస్క్ ధరించటం • శీతల పానీయాలు, ఐస్‌క్రీమ్‌లు తీసుకోకపోవడం • 'దుమ్మూ-ధూళి'కి దూరంగా ఉండటం • పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం వంటి జాగ్రత్తలతో కొంతవరకు ఈ వ్యాధిని నియంత్రించుకోవచ్చును.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా ఎలాంటి శ్వాసకోశ సమస్యలనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక మరియు శరీర తత్వాలను పరిగణనలోకి తీసుకున్న తదుపరి అందించబడే చికిత్స ద్వారా శరీర రోగనిరోధక వ్యవస్థలోని అసమతుల్యతలను సరిచేసి, పైన తెలిపిన అలర్జీ కలిగించే పరిస్థితులను సమర్థవంతంగా ఎదుర్కొనేలా మరియు, మళ్ళీ ఇంకొకసారి ఈ సమస్య తిరగబెట్టని విధంగా పూర్తిగా నయం చేయటం జరుగుతుంది.




వెనుక వైపున శివలింగం, దాని పైనుంచి నాగేంద్రుడిని తయారుచేశారు. గణపతికి ఇరువైపులా శ్రీలంక శాంకరీదేవి, కాశ్మీర్ సరస్వతి దేవిలు కొలువు తీరగా, గణపతికి కుడివైపున తిరుపతి వెంకటేశ్వర స్వామి పద్మావతి, అలివేలుమంగలతో; ఎడమవైపున గోవర్ధనగిరిని ఎత్తిన శ్రీకృష్ణుడి ఘట్టాన్ని కనుల పండువగా రూపొందించారు.

## ఈసారి తొలి నిమజ్జనం ఖైరతాబాద్ గణేశుడిదే...!

వినాయక ఉత్సవాలు అంటేనే నగరమే గాక రాష్ట్ర వ్యాప్తంగా అందరి ఆకర్షించే ఖైరతాబాద్ భారీ గణపతి నిమజ్జనానికి అందరి కంటే చివరగా బయలుదేరి మరుసటి రోజు సాగరంలో నిమజ్జనమవుతుండడం ఆనవాయితీగా వస్తోంది. ఈసారి ఆ ఆనవాయితీని పక్కనబెట్టి పోలీసులు నగరంలోని అని విగ్రహాల కంటే ముందుగా ఖైరతాబాద్ గణపతిని నిమజ్జనం చేసేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ మేరకు పోలీసులు ఉత్సవ కమిటీ నిర్వాహకులతో ప్రత్యేకంగా సమావేశమై పలు సూచనలు అందించినట్లు తెలుస్తోంది. భారీ గణ


శిల్పి రాజేంద్రన్

పతిని నిమజ్జనానికి తరలించేందుకు రెండు రోజుల ముందు నుంచే పనులు ప్రారంభమవుతాయి. ఈసారి నిమజ్జన రోజుకు ముందుగానే గణపతి కోసం వేసిన షెడ్డును తొలగించే పనులతో పాటు పక్కన ఏర్పాటయ్యే కర్రల తొలగింపు మూడు రోజుల ముందు నుంచే పనులు ప్రారంభం కానున్నాయి. నిమజ్జనం ముందు రోజు రాత్రి వరకు అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకొని తెల్లవారుజాములోపు భారీ గణపతిని ట్రాలీపైకి ఎక్కించి ఉదయం 6 గంటలకే శోభాయాత్ర ప్రారంభమయ్యేలా పోలీసులు ఏర్పాట్లు చేస్తున్నారు. ఉదయం 9 గంటల కల్లా గణపతి శోభాయాత్ర హుస్సేన్‌సాగర్‌కు చేరుకుంటుందని, వెల్డింగ్ తొలగింపు పనులు పూర్తి చేసుకొని మధ్యాహ్నం 12 గంటల లోపు ఖైరతాబాద్ గణపతిని నిమజ్జనం చేయాలని పోలీసులు భావిస్తున్నారు.



## పూర్వ జన్మ సుకృతం

"లక్షలాది మంది ఆరాధ్య దైవంగా భావించే వినాయకుడిని సర్వాంగ సుందరంగా సిద్ధం చేయడం ఎంతో సంతోషకరం. భగవంతుడి సంకల్పంతోనే మాత్రమే ఏటా ఈ ఉత్సవాలను వైభవంగా నిర్వహించగలుగుతున్నాం. వినాయక ఉత్సవాలలో లక్షలాది మంది భక్తులు తన్మయత్వంతో గణేషుడికి మొక్కుతున్నారు. ఈ యజ్ఞంలో భాగస్వామిని కావడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను" అన్నారు గణేశ ఉత్సవ కమిటీ చైర్మన్ సింగరి సుదర్శన్. "సాక్షాత్తూ గణేషుడే 11 రోజుల పాటు ఖైరతాబాద్‌లో కొలువై ఉంటాడని చెప్పేందుకు వందలాది ఉదాహరణలు ఉన్నాయి. మన రాష్ట్రమే కాక ఇతర


తుదిమెరుగుల్లో శ్రీ శక్తిపీఠ శివనాగేంద్ర మహాగణపతి

రాష్ట్రాల నుండి భక్తులు వచ్చి తమ కోరికలు తీరాయని చెప్తుంటే మా ఆనందానికి అవధులు ఉండవు" అన్నారాయన.

"రామకృష్ణ సిని స్టూడియోలో పనిచేస్తున్న నన్ను 1978లో గణపతిని తయారుచేయాలని కోరారు శంకరయ్య. అప్పటి నుంచి 1992 వరకు 40 అడుగుల వినాయకుడిని నేనే తయారు చేశాను. తిరిగి 2000 సంవత్సరం నుంచి ఇప్పటివరకు నేనే ఆ మూర్తిని తయారు చేస్తున్నాను. లాభాపేక్ష లేకుండా భక్తితో తయారు చేస్తున్నప్పటినుంచి నా దశ-దిశ మారిపోయాయి. నేను జీవించి ఉన్నంత కాలం వినాయకుడిని అందరూ మెచ్చేలా తయారు చేస్తాను" అన్నారు భారీ గణేశుడి శిల్పి రాజేంద్రన్.

## భారీ లడ్డూ.. ప్రత్యేక ఆకర్షణ

కొన్నేళ్ళుగా తాపేశ్వరంకు చెందిన సురుచి స్వీట్స్ వారు ఖైరతాబాద్ గణపతికి భారీ లడ్డూను నివేదిస్తున్నారు. ఈసారి కూడా భారీ నేతి లడ్డూను ప్రత్యేకంగా తయారు చేయించారు. ఎన్నో ప్రత్యేకతలతో, మహిమలతో భక్తులను ప్రత్యక్షంగా ఆశీర్వదిస్తున్నట్టు ఉండే ఖైరతాబాద్ గణపతి భక్తులపాలిట కొంగుబంగారం.

**- వెనగంటి లక్ష్మణ యాదవ్**
ఆంధ్రజ్యోతి, ఖైరతాబాద్

# సొరియాసిస్‌తో నిద్ర ఆహారాల్లేవు


డాక్టర్ పూజారి రవికుమార్

ఆర్ కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ సెంటర్

క్లినిక్స్: హైదరాబాద్,విజయవాడ, వైజాగ్, హన్మకొండ,కర్నూలు, తిరుపతి

ఫోన్స్: 98492 54587, 040-23057483




**నా పేరు శ్రీనివాస్.** వయసు 28. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌ను. ఆర్థికంగా ఇబ్బందుల్లేవు గానీ, జీవితమే దరిద్రంగా తయారయ్యింది. నిద్ర దేవుడిచ్చిన వరం అంటారు. ఎందుకో మరి ఆ వరం నాకు దక్కలేదు. అదేమంటే నువ్వు చేసిన పాపాలకు నీకు దేవుడు పెట్టిన శాపం అంటూ ఉంటారు కొందరు. నాకు తెలిసి నేనంతంటి పాపాలేమీ చేయలేదు. ఈ మాటే ఒ క డాక్టర్‌తో అంటే అది ఒంట్లో పుట్టిన వ్యాధే తప్ప పాపాలకూ, శాపాలకూ సంబంధం ఏమీ లేదన్నారు. ఆ మాటైతే నాకు ఓదార్పునిచ్చింది కానీ, ఆ యన వైద్యం మాత్రం నాకు వ్యాధినుంచి ఉపశమనాన్ని ఇవ్వలేదు. ఏ వేవో స్టెరాయిడ్స్ ఇచ్చి తాత్కాలిక ఉపశమనాన్ని ఇచ్చాడు తప్ప వ్యాధిని మాత్రం పోగొట్టలేదు. నాలుగేళ్ల పాటు క్రమం తప్పకుండా మందులు వాడినా సమస్య సమూలంగా పోలేదు. దాదాపు రెండేళ్లుగా ఏ నాడూ నేను కంటినిండా నిద్ర పోయింది లేదు. తెల్లవార్లూ దురద మంటలతో సతమతమవుతున్నాను. తెల్లవార్లూ నిద్రలేకపోవడంతో తిన్నదేదీ జీర్ణం కాదు. ఆకలి పూర్తిగా మందగించింది. నిద్రాహారాల్లేక నిర్జీవంగా బతుకు ఈడుస్తున్నాను. ఆయుర్వేదంలో తప్ప ఈ వ్యాధికి మరే వైద్య విధానంలోనూ చికిత్స లేదని మా శ్రేయోభిలాషి ఒకరు చెప్పారు. మీరు ర మ్మంటే సాధ్యమైన త్వరగా మిమ్మల్ని కలుస్తాను.

•••

ఎన్ని మందులు వాడినా, సొరియాసిస్ ఎప్పటికీ శాశ్వతంగా పోదేమో అనుకుంటారు చాలా మంది. ఎంతసేపూ వ్యాధి లక్షణాలను అణచివేయడమే తప్ప, వ్యాధి మూలాలను తొలగించే వైద్యం అందనప్పుడు సొరియాసిస్ అలా కొనసాగుతూనే ఉంటుంది. అందుకే ఆయుర్వేద వైద్య విధానం మిగతా అన్ని వైద్య విధానాల కన్నా భిన్నంగా వెళుతుంది. వ్యాధి రావడానికి గల అసలు కారణాలను పరిశీలించి, వాటిని సమూలంగా తొలగించే అన్ని చర్యలూ తీసుకుంటుంది. చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు అత్యధిక ప్రాధాన్యతనిస్తుంది.



## నరాలు దెబ్బ తింటే ఇంకేముంది?

ఏ వ్యాధీ దరిచేరకుండా నియంత్రించేది, సహజంగా మన శరీరంలో ఉండే వ్యాధి నిరోధక శక్తే. అయితే, వాత ప్రకోపం, మానసిక ఒత్తిళ్లు, నిద్రలేమి వంటి కారణాలతో సొరియాసిస్ రోగుల్లో వ్యాధి నిరోధక శక్తి బాగా తగ్గిపోతుంది. ఈ శక్తి తగ్గడం వల్ల శరీరంలోని ఇతర వ్యవస్థలన్నీ దెబ్బ తింటాయి. ప్రత్యేకించి, నాడీవ్యవస్థ అంతా దెబ్బ తింటుంంది. శరీరంలోని ప్రొటీన్ అంతా మృతకణాల రూపంలో బయటికి వెళ్లడం వల్ల సహజంగానే నరాలన్నీ చచ్చుబడిపోతాయి. సొరియాసిస్ కారణంగా ఒత్తిడి తీవ్రత పెరిగినప్పుడు హార్మోన్ వ్యవస్థలో కీలకమైన ఎడ్రినలిన్ గ్రంధి దెబ్బ తింటుంది. ఇతర ధాతువులతో పాటే ఎముకలకు సంబంధించిన అస్థి ధాతువు కూడా క్షీణించడంతో సొరియాటిక్ ఆర్థరైటిస్ సమస్య మొదలవుతుంది.

## హార్మోన్ వ్యవస్థలో....

అసలు మనిషంటేనే, ఒక పెద్ద హార్మోన్ వ్యవస్థ. ఇది శరీరంలోని దేహక్రియలన్నిటితో పాటు, సమస్త భావోద్వేగాలను నియంత్రిస్తుంది.సొరియాసిస్ కారణంగా పెరిగే మానసిక ఒత్తిళ్లు, లేదా ప్రతికూల భావోద్వేగాల వల్ల వచ్చే పరిణామాల కారణంగా, మెదడులో జరిగే రసాయనిక మార్పులు చాలా తీవ్రంగా ఉంటాయి ఈ మార్పుల వల్ల మొత్తం మన నాడీవ్యవస్థను నియంత్రించే మెదడులో వచ్చే మార్పులు ఎడ్రినల్ గ్రంధిని బాగా ప్రభావితం చేస్తాయి. ఎడ్రినల్ గ్రంధి ఇలా దుష్ప్రభావానికి గురికావడం వల్ల అందులోంచి విడుదల అయ్యే రసాయనాల్లో వచ్చే మార్పుల వల్ల, శరీరంలోని కిడ్నీలు, లివర్, పేగుల్ని, నాడీవ్యవస్థ అంతా దెబ్బ తినిపోతుంది. సొరియాసిస్ బాధితుల్లో సహజంగా ఉండే నిద్రలేమి కూడా నాడీవ్యవస్థను బాగా దెబ్బ తీస్తుంది. నిజానికి ఈ వ్యవస్థలన్నిటినీ నియంత్రించేది ఎడ్రినల్ గ్రంధియే. మానసిక సమస్యల కారణంగా ఎడ్రినల్ గ్రంధి మీద ఒత్తిడి పడినప్పుడు, ఎడ్రినల్ గ్రంధి నుంచి వచ్చే హార్మోన్లలో ఏర్పడే మార్పుల వల్ల మనిషి తీవ్రమైన డిప్రెషన్‌కు లోనైపోతాడు. సొరియాటిక్ ఆర్థరైటిస్ ద్వారా వెన్నుముక దెబ్బతిని వెన్నుపాము ఒత్తిడికి గురైనప్పుడు ఒక్కోసారి మలమూత్రాలు ఆగిపోవడంతో పాటు పురుషుల్లో అంగస్తంభన సమస్యలు, శీఘ్రస్ఖలన సమస్యలూ తలెత్తుతాయి.

## ఆయుర్వేదమే అసలైన వైద్యం

సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. వాతం నియంత్రణలోకి రాగానే మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. నిలువెల్లా పాకిపోయిన సొరియాసిస్ మచ్చల్ని చూసి కొందరు ఇవి ఎప్పటికైనా పోతాయో లేదో అనుకుంటారు. కానీ, వాస్తవానికి ఆయుర్వేద చికిత్సలు మొదలైన 25 రోజులకే సొరియాసిస్ మచ్చలు బాగా తగ్గిపోతాయి. ఆ తరువాత వ్యాధిని సమూలంగా తొలగించడానికి మరో మూడు నాలుగు మాసాల పాటు కడుపులోకి ఇచ్చే ఔషధాలు తీసుకోవాలి. అన్నీ కలిసి, సొరియాసిస్‌తో పాటే వచ్చిన నరాల సమస్యలు, వెన్ను, కీళ్ల సమస్యలు తొలగిపోతాయి. ఒకవేళ లైంగిక సమస్యలు కూడా మొదలైతే, అవి పూర్తిగా తొలగిపోయి శరీరం సంపూర్ణ శక్తివంతంగా మారుతుంది. ఇతర వైద్య చికిత్సలు తీసుకుని కూడా సొరియాసిస్ తగ్గని వారిని చూసి, అది ఇంక ఎప్పటికీ తగ్గదనే నిర్ధారణకు వచ్చేస్తారు.కానీ, ఆయుర్వేదానికి సొరియాసిస్‌ను తగ్గించడం వెన్నతో పెట్టిన విద్య. అది సొరియాసిస్‌ను సమూలంగా, శాశ్వతంగా తొలగించి తీరుతుంది. వైద్య చికిత్సలు పూర్తి అయిపోయిన తర్వాత శరీరం మీద సొరియాసిస్ ఛాయలే కనిపించవు.



విఘ్నేశ్వర జన్మ వృత్తాంతంపై పలు రకాల గాథలున్నాయి. వాటిని ఒక్కొక్క పురాణం ఒక విధంగా వర్ణించింది. వాటిలో వరాహ పురాణం పేర్కొన్న విఘ్నేశ్వర జన్మ వృత్తాంతం తక్కిన పురాణ కథలకు భిన్నంగా ఉంది. ఈ పురాణం విఘ్నేశ్వరుడు ఆకాశం నుంచి జన్మించినట్టు చెప్పింది. రాక్షసుల బాధ ఎక్కువ కావడంతో ఆ బాధ నుంచి విముక్తి చెందే ఉపాయం చెప్పమని ఋషులు, దేవతలు శివుడిని అడిగారు. పరమశివుడు ఈ విషయమై సుదీర్ఘంగా ఆలోచిస్తూ ఒకసారి తల ఎత్తి ఆకాశం వంక చూశాడు. అప్పుడు ఆయన కంటికి అత్యంత సుందరంగా పార్వతీ దేవి కనిపించింది. శివుడు అప్రయత్నంగా 'పంచభూతాలలో తక్కిన వాటికంతా రూపం ఉండగా ఆకాశానికి ఎందుకు లేదు' అని ప్రశ్నించాడట! జగజ్జనని అయిన పార్వతిని చూచి పరమ

# విఘ్నేశ్వర జననం

శివుడే అట్లా ప్రశ్నించడంతో ఆకాశం పుత్రరూపం దాల్చి శివుడి ఎదుట నిలిచింది. అదెంత సుందర రూపమంటే పార్వతీదేవి కూడా చంచల చిత్తంతో చూసిందట. ఆ బాలుడు ఇతర దేవతా స్త్రీలను కూడా అట్లాగే భ్రమింప చేయడంతో పరమ శివుడికి కోపం వచ్చి "నీవు ఏనుగు తల, బాన కడుపుతో వికార రూపుడవుకమ్మని' శపించాడు. వెంటనే ఆకాశం నుంచి జన్మించిన ఆ బాలుడు ఆ రూపంలోకి మారాడు. ఈశ్వరుని వల్ల విఘ్నుత చెందడం వల్ల ఆయనకు విఘ్నేశ్వరుడనే పేరు వచ్చింది. అంతటితో శివుడి కోపం చల్లారలేదు ఆయన శరీరం చెమర్చింది. ఆ చెమట చుక్కల నుంచి వేనకు వేలు గజాస్యులు పుట్టుకొచ్చారు. ఆ తర్వాత దేవతలంతా పరమశివుడిని ప్రార్థించి శాంతచిత్తుని చేశారు. అలా పుట్టిన గజాస్యులు విఘ్నేశ్వరుని పరివారంగా ఉంటుందని, గణాధిపతిగానేకాక ప్రతి కార్యంలో ముందుగా విఘ్నేశ్వరుడు పూజింపబడతాడని శివుడు అనుగ్రహించాడు. వరాహ పురాణం ప్రకారం విఘ్నేశ్వరుడు ఆకాశ స్వరూపం. ■

# ఫస్టు మార్కొస్తేను పదహారయా!

ఓ బొజ్జ గణపయ్య నీ బంట్లు మేమయ్య
ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా
మా ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా
మార్కులెన్నో వచ్చి మేలుగా పాసైతే
కోర్కె తీరా నిన్ను కొలిచేమయ్యా



మేళతాళాలు మారు మోగేటట్లు
ఉత్సవాలెన్నెన్నో చేసేమయ్యా
పోయినసారి మరీ పదమూడే వచ్చాయి
ఈసారైనాను ఇరవై దాటిస్తేను
కొబ్బరికాయలూ కొడతామయ్యా
నీకు పెద్దపెట్టున పూజ పెడతామయ్యా
ముప్పై ఐదొస్తేను మూడు కొడతామయ్యా
నల్లభై ఐదొస్తేను ఏడు కొడతామయ్యా
ఫస్టు మార్కొస్తేను పదహారయ్యా
పదహారయ్యా తండ్రి పదహారయ్యా
కొబ్బరికాయలు నీకు పదహారయ్యా
ఓ బొజ్జ గణపయ్య నీ బంట్లు మేమయ్య
ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా



# నిమజ్జనం ఎలా చేయాలి?

వినాయక చవితికి, దసరాకు నవరాత్రులు నిర్వహించడం సంప్రదాయం. తొమ్మిది రోజుల పాటు పూజలు నిర్వహించి, ఆ తరువాత దేవతామూర్తులను నిమజ్జనం చేయడం అనాదిగా వస్తున్నది. హైదరాబాద్‌తో పాటు పలు ప్రాంతాల్లో గణేశ నిమజ్జనం ఘనంగా నిర్వహిస్తున్నారు. వినాయకచవితి నాడు కానీ, 3, 5, 7, 9వ రోజు కానీ నిమజ్జనం నిర్వహించాలి. అంటే బేసి సంఖ్య వున్న ఏ రోజైనా స్వామిని నిమజ్జనం చేయవచ్చు. నిమజ్జనం చేసే ముందు గణపతికి భక్తితో ధూపదీప నైవేద్యాలు సమర్పించాలి. తీర్థ ప్రసాదాలను అందరూ భుజించి ఆ తరువాత సంప్రదాయ బద్ధంగా నిమజ్జనం ఊరేగింపు నిర్వహించాలి. నిమజ్జన ఊరేగింపు సమయంలో ఉత్సాహంతో కేరింతలు కొట్టడం, పాటలు, నృత్యాలు సహజమే. గణపతి విగ్రహాన్ని ప్రతిష్ఠించే సమయంలో ఎంతో శాస్త్రోక్తంగా పూజ చేసి మరీ ఉత్సవాలను ప్రారంభిస్తాం. మరి నిమజ్జనం చేసే సమయంలో ఎటువంటి సంప్రదాయం పాటించాలి? ఏ మంత్రాన్ని.. ఏ శ్లోకాన్ని పఠిస్తూ ఆ గణనాథుడ్ని నీటిలోకి వదలాలి? నిమజ్జన ఉత్సాహ సమయంలో ఈ సంప్రదాయాన్ని పాటించే వారు చాలా తక్కువమంది వుంటారు... అసాధ్యమైన విషయమేమీ కాదు కాబట్టి ప్రతి ఒక్కరూ గణనాథుడ్ని నీటిలోకి జారవిడిచే ముందు '**శ్రీ గణేశం ఉద్వాసయామి ... శోభనార్థం పునరాగమనాయచ**' అని చెప్పుకోవడం సంప్రదాయం. ■

**ఓం శాంతి శాంతి శాంతిః**

**స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం**
**న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః**
**గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం**
**లోకస్సమస్తాస్సుఖినోభవంతు**

